

నాట్యకళోపాసకాంధ్ర హృదయ
నెల్లుట్ల రామకృష్ణకవి, జమీందార్
కూనూరు
వరంగల్ జిల్లా. యన్. యస్. ఆర్.

# మ న వి

గీ॥ పండితుఁడు మంచినే తన మూళిఁదాల్చి
కాసిదానిని కంఠములోనఁ బెట్టు
శంకరుఁడు సంద్రమునఁబుట్టు చందమామఁ
జూపి గరళమ్ము నెవరికిఁ జూపనట్లు.

---

# అంకితము

ఉ॥ నీసుధఁ జిందుపూపనునునిగ్గులఁదేఱెడి భావపుష్ప సం
వాసముఁజేసియే కవిత వ్రాయఁగనేర్చిన నేను ప్రేమతో
దోసిలియొగ్గి యిచ్చెదను త్రోయక నీ'యుపహార'మంది నా
బాసఁదరింపఁజేయుము కృపామతి! జాషువ! రామకృష్ణుఁడన్!

—

# స్మృతి

గీ॥ సన్నుతమ్మైన నీదువంశమ్మునందు
పుట్టుటయెగాక కలము చేఁ బట్టిగూడ
నిన్ను మఱచిపోయెడు నాదు నేరమునకుఁ
బోలునది మఱియుండదు పోతరాజ. ౧

గీ॥ తనదు సేయు తప్పుఁ దానెఱింగినవానిఁ
గోపమింకఁ జేయఁగూడ దనుచు
నన్ను ప్రేమఁజూచి నాతప్పు మన్నించి
నాదుచేయు భక్తినతులుగొనుము. ౨

సీ॥ "సర్వజ్ఞసింగయక్ష్మాపతి గలిగించు
సిలుగుల కేతీరుఁ జివికినాఁడొ
దారిద్ర్యదేవత తాండవింపఁగ నెట్లు
జీవయాత్రను వెళ్ళఁజేసినాఁడొ
భాగవతము బ్రతుకు మన్నుపాలై పోవ
చలియింప కే భంగి నిలిచినాఁడొ
కొడుకు మల్లన్నతో మడుల దున్నుచు నెంత
లేసి కష్టమ్ముల మోసినాఁడొ
గీ॥ మాదు పోతన్న హా దైవమా" యటంచు
నీదు స్మృతియందుఁ దొరఁగు కన్నీటితోడ
దోసిలి నొసంగి నా చేయుదోసములను
పోవఁజేసెద నేనింక పోతరాజ! ౩

---

# ప్ర బో ధ ము

గీ॥ ఆంధ్రరక్తమ్ము నీమేన నలరునేని
ఆంధ్రహృదయమ్ము నీయందు నణఁగునేని
ఆంధ్రదేశమ్ము నీగృహమయ్యెనేని
ఆంధ్రభాషను నాభాషయనఁగ రమ్ము. ౧

గీ॥ హింది యింగ్లీషు వ్యామోహమందు మునిఁగి
పొట్టకూటికి గతిలేక పిట్టకతలఁ
బెద్దసేయుచు నేమొసెప్పెదవు కాని
తెలుఁగు కలముల విలువలు తెలుపవేమి? ౨

గీ॥ పుణ్యతముఁడైన బమ్మెర పోతరాజు
పావనశీల రచియించు భాగవతము
స్వాంతమలరంగ నొకమాఱుఁ జదువలేదు
తెలియ వచ్చెడి నీకెట్లు తెలుఁగు మహిమ? ౩

గీ॥ భాషలందున మన యాంధ్రభాష మేలు
భూములందున మన యాంధ్రభూమిమేలు
శిల్పులందున మన యాంధ్రశిల్పి మేలు
కవులయందున మన యాంధ్రకవియె మేలు. ౪

గీ॥ మొదట నింటను గెలుపొంది పిదప రచ్చ
గెలువ వలెనను నుడి నింతఁ దలఁచి నీవు
మెన్ని భాషల నేటీసు నీదులాడి
నను నినుంగూర్చి యింక నేమనము మేము? ౫

గీ॥ జ్ఞానవంతులౌ కొడుకుల నలువురఁగని
వారియందున నైదవవానిఁ గాఁగ
నందుకొనినాఁడు బ్రహ్మ పసందుతోడ
భారతమ్మును, నీకిది భారమెట్లు? ౬

గీ॥ అన్యదేశీయ భాషలయందు మునిఁగి
మాదుమాటను నీమది మఱచియున్న
మాకు మాత్రము నీవింత మఱపురావు
ధర్మమునె చూతుమే మనృతమ్ము కాదు. ౭

గీ॥ 'ఆదరమ్మున నాకు మర్యాదనిట్లు
బాధకలుగని రీతి ప్రబోధమెవరు
సేయుచున్నారొ'లని తలపోయుదేమొ
మలఁగి చూడుము; కవికుమారులము మేము. ౮

---

# సమర్థనము

గీ॥ తనదువారు వేడుదాని నెఱింగించి
విన్న దేమొ పోయి వినుచుఁగాని
రాయబారి వైరిరాజునిందింపఁడు
గొల్లవాఁడు పుట్టుకొంటె కాఁడు. ౧

గీ॥ మాటికనినీవు నన్నే మొమాయజూద
మాడి ధర్మజునోడించి తందువయిన
మాదుతండ్రి మదిష్టమువిూఁద మఱల
నేను గెల్చినదంతయు నివఁడె? కృష్ణ! ౨

గీ॥ అయిన వెండియు ధర్మజు నాడఁబిల్చి
యిట్లు సేయంగ నేటికటందు వేని
యంతమాత్రాన నతఁడేల యాడవలయు
ననుచునడిగెద దీని కేమనెదవీవు? 3

గీ॥ 'ఆడ మఱివత్తువా?' యంటినంతెకాని
యట్టె నేఁబోయి గడ్డముపట్టలేదు
పందెమునఁజెప్పఁబడినట్టి మాట నడవి
కేఁగినారిందు నా దోసమేమి? కృష్ణ! ౪

గీ॥ 'వదినె'యను మాటనేనియు మదిఁదెలుపక
అంతసభకీడ్చి యాద్రుపదాత్మజ నయొ
ముట్టుతోనుండుదానిని ముట్టుకొనుచు
కట్టుబట్టల విడిపింతుగాదె? యనుదె? ౫

గీ॥ మానవేశ్వరుఁడను భీతియేని లేక
యట్లు దాసీలఁగూడి చప్పట్లఁగొట్టి

నన్ను నవ్వఁగఁ నేఁటికానాఁడు? దాని
నేమి నేసితివనఁ జేయ కేలపోదు? ౬

గీ॥ భీమునకునీవు విషమును బెట్టినావు
యంత యేగాక వారలనందఱ నటు
లక్కయిలుఁ జేర్చి చంపఁదలంచి తెందు
నింతయుండునె? యన లాభమేమి? కృష్ణ! ౭

గీ॥ తమ్ములతో నేను చనవునఁదమ్ముకూడి
యాడుకొనునాఁడు మమ్మెల్ల ననిలజుండు
కావరమ్మంది యాతీరుగాసిఁ బెట్ట
నేల? యింక నాదు చేతల కేమిలెక్క? ౮

గీ॥ 'కదనఫలితముఁ గనఁ బ్రజాక్షయమె కాన
కూడ'దను నీదునుడి నొప్పుకొందు నేను
కాని వారలె కాదని కదలునపుడు
నేను గాజులఁ దొడుగుదు నెట్లు? కృష్ణ! ౯

గీ॥ అర్ధరాజ్యమ్ము మాట యనర్థమైన
వారుకోరెడు నట్టిదై దూఱు లేని
యొసఁగ రాదొక్కొ యని నన్ను కొసరికొసరి
నాకు తలనొప్పిఁ బుట్టింపఁ బోకవినుము. ౧౦

ఆ॥ రాజరాజు బొందిఁ బ్రాణమ్ములెందాఁక
నుండునంతవఱకు నుర్వియందు
వాఁడిసూది మొనకు వచ్చునంతయుఁ గూడ
నీయఁజాలఁడేఁగు మింక; కృష్ణ! ౧౧

---

# ప్రబోధము

గీ॥ ఆంధ్రరక్తమ్ము నీమేన నలరునేని
ఆంధ్రహృదయమ్ము నీయందు నణఁగునేని
ఆంధ్రదేశమ్ము నీగృహమయ్యెనేని
ఆంధ్రభాషను నాభాషయనఁగ రమ్ము. ౧

గీ॥ హింది యింగ్లీషు వ్యామోహమందు మునిఁగి
పొట్టకూటికి గతిలేక పిట్టకతలఁ
బెద్దసేయుచు నేమొ సెప్పెదవు కాని
తెలుఁగు కలములఁ విలువలు తెలుపవేమి ? ౨

గీ॥ పుణ్యతముఁడైన బమ్మెర పోతరాజు
పావనశ్రీల రచియించు భాగవతము
స్వాంతమలరంగ నొకమాఱుఁ జదువలేదు
తెలియ వచ్చెడి నీకెట్లు తెలుఁగు మహిమ? 3.

గీ॥ భాషలందున మన యాంధ్రభాష మేలు
భూములందున మన యాంధ్రభూమి మేలు
శిల్పులందున మన యాంధ్రశిల్పి మేలు
కవులయందున మన యాంధ్రకవియె మేలు. ౪

గీ॥ మొదట నింటను గెలుపొంది పిదప రచ్చ
గెలువ వలెనను నుడి నింతఁ దలఁచి నీవు
మెన్ని భాషల నేతీరు నీదులాడి
నను నినుంగూర్చి యింక నేమనము మేము? ౫

 



గీ॥ జ్ఞానవంతులౌ కొడుకుల నలువురఁగని
వారియందున నైదవవానిఁ గాఁగ
నందుకొనినాఁడు బ్రహ్మ పసందుతోడ
భారతమ్మును, నీకిది భారమెల్లు ? ౬

గీ॥ అన్యదేశీయ భాషలయందు మునిఁగి
మాదుమాటను నీమది మఱచియున్న
మాకు మాత్రము నీవింత మఱపురావు
ధర్మమునె చూతుమే మన్నతమ్ము కాదు. ౭

గీ॥ 'ఆదరమ్మున నాకు మర్యాదనిట్లు
బాధకలుగని రీతి పరిబోధమెవరు
సేయుచున్నారొలని తలపోయు దేమొ
మఱఁగి చూడుము; కవికుమారులము మేము. ౮

---

# సమర్థనము

గీ॥ తనదువారు వేడుదాని నెఱింగించి
విన్నదేమొ పోయి వినుచుఁగాని
రాయబారి వైరిరాజునిందింపఁడు
గొల్లవాఁడు పుట్టుకొంటెకాఁడు. ౧

గీ॥ మాటికినినీవు నన్నే మొమాయజూద
మాడి ధర్మజునోడించి తండువయిన
మాదుతండ్రి మదిష్టమువిూఁద మఱల
నేను గెల్చినదంతయు నివఁడె? కృష్ణ! ౨

గీ॥ అయిన వెండియు ధర్మజు నాడఁబిల్చి
యిట్లు సేయంగ నేటికటందు వేని
యంతమాత్రాన నతఁడేల యాడవలయు
ననుచునడిగెద దీని కేమనెదవీవు? ౩

గీ॥ 'ఆడ మఱివత్తువా?' యంటినంతెకాని
యట్టె నేఁబోయి గడ్డముపట్టలేదు
పందెమునఁజెప్పఁబడినట్టి మాట నడవి
కేఁగినారిందు నా దోసమేమి? కృష్ణ! ౪

గీ॥ 'వదినె'యను మాటనేనియు మదిఁదెలుపక
అంతసభకీడ్చి యాద్రుపదాత్మజ నయొ
ముట్టుతోనుండుదానిని ముట్టుకొనుచు
కట్టుబట్టల విడిపింతుగాదె? యనుదె? ౫

గీ॥ మానవేశ్వరుఁడను భీతియేని లేక
యట్టు దాసీలఁగూడి చప్పట్లఁగొట్టె

నన్నునవ్వఁగఁ నేఁటికానాఁడు? దాని
నేమి నేసితివనఁ జేయ కేలపోదు? ౬

గీ॥ భీమునకునీవు విషమునుబెట్టినావు
యంతయేగాక వారలనందఱి నటు
లక్కయిలుఁజేర్చి చంపఁదలంచి తెందు
నింతయుండునె? యన లాభమేమి? కృష్ణ! ౭

గీ॥ తమ్ములతో నేను చనవునఁదమ్ముకూడి
యాడుకొనునాఁడు మమ్మెల్ల ననిలజుండు
కావరమ్మంది యాతీరుగాసిఁబెట్ట
నేల? యిఁక నాదు చేఁతల కేమిలెక్క? ౮

గీ॥ 'కదనఫలితముఁ గనఁ బ్రజాక్షయమె కాన
కూడ'దను నీదునుడినొప్పుకొందు నేను
కాని వారలె కాదని కదలునపుడు
నేను గాజులఁదొడుగుదునెట్లు? కృష్ణ! ౯

గీ॥ అర్ధరాజ్యమ్ముమాట యనర్థమైన
వారుకోరెడు నట్టిదై దూళ్ళు లేని
యొసఁగరాదొక్క యని నన్ను కొసరికొసరి
నాకు తలనొప్పిఁ బుట్టింపఁబోకవినుము. ౧౦

ఆ॥ రాజరాజు బొందిఁ బ్రాణమ్ములెందాఁక
నుండునంతవఱకు నుర్వియందు
వాఁడిసూది మొనకు వచ్చునంతయుఁగూడ
నీయఁజాలఁడేఁగు మింక; కృష్ణ! ౧౧

## కలముపోటు

గీ॥ నీదునామమ్ముఁ గలరాజు నిక్కువమున
వసుధజన్మించెనో లేక వ్యాసమౌని
పొ్రద్దువోవక యీతీరు బూటకముగ
రద్దినిన్నుఁ జేసెనో యేమొ రాజరాజ! ౧

గీ॥ దీనికింతగ నాకు సందేహమేల?
యుండియుందువు సత్యవంతుండు తాత
తప్పఁజూడఁడు; నాల్గువేదములవ్రాయు
చేతికలమును తప్పువచింపఁబోదు. ౨

గీ॥ అయిననినుఁగొన్ని ప్రశ్నలనడుగవలతు
నేను, వానికి నీవింక మానవేశ్వ
రా! కలంగక నన్ను మర్యాదసేసి
వాసి తళుకొత్తనాకు జవాబులిమ్ము! 3

గీ॥ నిన్నుఁగొనియాడవలెనన్న నిన్నెగాక
నన్నుసైతము నీతోడనల్వురేమొ
కేకరింతలఁబెట్టి కేకసలఁ గొట్టి
నవ్వుదురు దీనికగుకారణమ్మదేమి? ౪

గీ॥ పాలసుండవెగాకున్న పావనియగు
ద్రుపదపుత్రిని సభకీడ్చి ధూర్తుఁడైతి
వేల? మఱఁది వయి వదినెకేలయట్లు
[illegible]గ సూపించి తా [illegible]గానితనము? ౫

గీ॥ నీదుసావాసముం జేసి కాదయేని
ముజ్జగమ్ములఁగూడను పూజనందఁ
దగిన మానిసి మాదు రాధాతనూజుఁ
డింతబదనామిపాలయి యేలపోవు? ౬

ఉ॥ పాలిడుమాకు భూమినను పాండవసంతతి మాటమీఁద నీ
పాలికిరాయబారిగ కృపామతివై సనుదెంచినట్టి గో
పాలుని తూఁటనాడితఁట; పగ్గములంగొని వచ్చితంట; భూ
పాలక! సెప్పు మెందులకు పాపముగా కదియేమి పుణ్యమే?

గీ॥ దేవకీనందనుఁడు దేవ దేవుఁడనుచు
తొలినెఱుఁగవా! యతనిహితోపదేశ
మేలవినలేదు? రక్తపుటేరులందు
తానమాడుటనే యేల తలఁచితయ్య? ౭

గీ॥ ఆడరానట్టి దుర్భాషలాడి భీముఁ
డుక్కుగదతోడ నీతొడలూడఁగొట్టె
రాజ! ననుచూడుమిఁక మానరాజువయిన
నింతయవమాన మెట్లు సహించినావు? ౮

మ॥ నిను నేనెన్నఁడు నింతయేనియునునిందింపందలంత్రపర సుయో
ధనునామమ్మున నింకధర్మివని సూత్రమ్మొండు సూపింతు కా
ని; నిజమ్మారయ లాభమేమి సెపవే? నీచేతలేమో జగ
మ్మున నింటింటికిఁగూడ బట్టబయలై పోమెంగదా? భూవరా!

---

# కలఁత

గీ॥ ఏమి కానోపు దేవి! నీభూమి నెపుడు
కాలుఁబెట్టితినో యేమొకాని నాదు
మానసమ్మున నెన్నఁడులేని 'కలఁత'
క్రమ్ముకొనుచుండె నిది దుర్భరమ్ముసుమ్ము. ౧

ఉ॥ వాసినివీఁడు కాటిభువి వాకిలిరూపము లేని భస్మసిం
హాసనమాని తల్లిరో! భయంకర లీల ననేకప్రాణముల్
దీసెడి నీదుచేఁతల మదిందలపోయఁగఁ జెప్పరాని యా
యాస మెగాక నాదుహృదయమ్మును తద్దయుఁగంపమందెడిఁ.

గీ॥ ఇట్లు భయపడు వీఁడు నన్నేమి పలుక
రించునని నీదు మనమున నెంచెదేమొ
అట్లుతలఁపకు మీవు నిన్నరసియిదిగొ
కొంత నీపాలనల విమర్శింతునేను. 3

గీ॥ విశ్వమందు నహో యెన్నొ వేలయేండ్లు
కడచిపోయెను కాని నీకడపఁజొచ్చు
మందభాగ్యుఁడొకండును మఱలిరాఁడు
యేమి మాయయొ కారణమేమి తల్లి! ౪

గీ॥ అమ్మ! యీదిక్కులేని శవమ్ముఁజూడు
మెంతయాఁకటిచిచ్చున నేడ్చి యెవఁడు
మేనుదొరఁగెనో - యేపేదవాని దగునో -
దాని దయఁజూచి నీవైన దాచవేమి? ౫

 

ఆ॥ ఎంతమందికవులయింపుకలమ్ములు
కరఁగ నొక్కొ నిప్పుకణికలందు
యెంతమంది రాజు లింకిపోయిరో యిందు
ఇంతయేని లెక్కనిడుదె? మాత! ౬

గీ॥ నీదు దేశమ్ముఁ గాంచి కన్నీరువదల
నట్టిమానిసి యొకఁడు కన్పడఁగరాఁడు
యుర్వి! నీయందుఁ జేరకయుండువాఁడు
చూడనొక్కఁడుఁ గూడ మచ్చునకు లేఁడు. ౭

గీ॥ ఇంకనినుఁ జూచి నేను నేఁడేల యిట్లు
పిచ్చివానికి బలె విలపింపవలెను
నేఁడుగాకున్న నిఁకొకనాఁడు నేను
లీనమైపోనె? నీదుగర్భాన; తల్లి! ౮

---

## మొ ఱ

గీ॥ అరె! ప్రపంచము నేఁడు భయంకరమగు
నాటల నఁట యథేచ్ఛగ నాడ మఱఁగి
మానవుల పారమార్థిక భావతతికి
స్వస్తి చెప్పెడినంట నాసామి వింటె! ౧

గీ॥ 'లోభియెవఁ'డను మాట కీ లోకులకట
'యతఁడె; భగవంతుఁడే' యని యందురంట
యదియె నిజముగ ప్రాచుర్యమందు నేని
ధర్మమనియేడ్చు నాకింక తా వదేది? ౨

గీ॥ ఈవు నిర్ధనికుల సృజియించుటరయ
యట్టివాఁడవేనంట కాదన్న నన్ను
కఱకుమాటల 'నీవు బేకారువాఁడ'
వందురేమేమొ యిద్దిన్యాయమ్మె? తండ్రి! ౩

గీ॥ ఇట్లు కానిదికల్పించి హీనులవలె
మొదలు తెలియక యే యరో మురిసిపడు జ
నాళి తెలివొంద జ్ఞానాంజన మ్మొసంగి
విననియపవాదఁ బాపికోవే! మహాత్మ! ౪

గీ॥ ధరణిజాతను రామావతారమందుఁ
జిన్ని యపవాదమునకె త్యజించితంట
యట్టివాఁడవు నింగిని ముట్టిపోవు
నింత యపవాదమెట్లు సహింతువయ్య. ౫

గీ॥ ఉండియున్నట్లె నిను నమ్మియుండువార
లిందఱును వమ్ముగాఁగ చలించినావు
'అచల' పేరెవరిది? దానికర్థమేమి?
యింత యన్యాయ మేము సహింపమవని! ౧

గీ॥ ఇది దగాబుద్ధిగాక మఱేమొయనిన
గర్జనమ్ముల కాఱుమేఘమ్ములెన్ని
పిడుగులను నీదుమేనఁ గుప్పింపలేదు
అపుడు కంపింపవెందుకమ్మా? సవిత్రి! ౨

ఆ॥ ఇన్ని దేవళముల నిన్ని మసీదుల
నిన్ని పట్టణముల నింతలోనె
నెగసి పావనమగు నీదుపొట్టకు కట్ట
బలినిజేయు టేటిమాట ధరణి! 3

గీ॥ అనవలదుగాని నీచేఁత లరయునపుడు
తనదు కౌఁగిటిబిడ్డను తినెడునట్టి
తల్లికని నీకునింత భేదమ్ములేదు
కాశ్యపి! యీఁకేని ధర్మమార్గమును కనుము. ౪

ఆ॥ నన్ను నేనెమఱచి కన్నతల్లి సమాన
మైన దానినేమి యాడితకట
పాపమెక్కువైనపట్లనె నీవిట్లు
కంపమందుచుందుగాదె? భూమి! ౫

---

# ఫిర్యాదు

గీ॥ శ్రీ మహారాజరాజ కిరీటరత్న
పుంజరుగ్భానుభాను సంఫుల్లపాద
పద్మయుగళేంద్ర ! నైజాము పార్థివేంద్ర
ఆదరమ్మున నాదు 'ఫిర్యాదు' వినుము ! ౧

గీ॥ 'వసుమతీధవుఁ'డన భగవత్స్వరూపుఁ
డనుచు శాసించి నిన్ను మే మధికభక్తి
కలిగియుండెడువారమె కాని యెపుడు
ద్రోహమొనరించు త్రోవను త్రొక్కమనఘ !

గీ॥ 'నీదుపాలన మీభూమి నిలిచియుండు
నంతవఱకును చల్లఁగ నలరుఁగాత !'
అనుచు బ్రిహ్మకుఁ గూడ భయమ్ముఁగొనని
కవుల దీవనలివె; కొంగుఁ గట్టుకొనుము ! ౩

గీ॥ బాస నలవరచెడి యాంధ్రిమాసపతి్ర
కలకు నాజ్ఞనివక మాదు కలములుగొను
జీవితము నిరర్థకమ్ముగఁ జేయనేమి
వచ్చుఁ ? జెప్పుము నాకింత వసుమతీశ ! ౪

గీ॥ పూతచారిత్రిమైననుజాత మఱల
కన్నులను విప్పుటకు 'దరఖాస్తు' నీయ
నీదు కొలువున నుండెడి నీతిమంతు
లెవ్వరోకాని యేమని యేడ్తు నేను? ౫

గీ॥ వింటె! 'అఫోస్'సనుట తప్ప వేఱె యొక్క
వాక్యమేనియు నందుకు వ్రాయలేదు
దీనిభావము నుంతయుఁ దెలియరాదు
ఇంత యన్యాయమున్నె! యెందేనియధిప! ౬

గీ॥ ప్రియమందున కొలఁది కన్పడుదు నేను
శక్తిహీనుఁడనఁట - నైన జంక నేల ?
బలముఁ గలిగిన; కలము చేఁ బట్టవచ్చుఁ
గాక! యిద్ది యధర్మముకాదె ? రాజ! ౭

గీ॥ సత్కవుల వంచనముఁ జేయ సాహసించు
పత్రికలకు నాకలమది పక్కలోని
బల్లెమై సంస్కరింప సంభవమునంది
మూలఁబడిమూల్గుచున్నది భూమిపాల! ౮

గీ॥ నీదుసన్మానమునఁజేసి నాదుపొట్ట
నింపుకొనుచుండునట్టి మానిసినటంచు
మఱలఁ జెప్పుదు నిత్తును ప్రాణములను
నేను దూరపువాఁడనుకాను నృపతి! ౯

గీ॥ ధరణినాథుఁడగాక సత్కవివి నీవు
నాదుమాటల నీమదినమ్మకున్న
'కవుల కన్నీరు జగమును గాసిపెట్టు'
ననెడి నుడినేని నాకింకనాజ్ఞనిమ్ము! ౧౦

—

# కవిదర్శనము

గీ॥ కమ్మనైనట్టి నీకైతకట్ల నేను
బంధితుఁడనౌచు నీదాఁకవచ్చినాను
రామకృష్ణుని పేరున రాజిలుదును
ధన్యుఁడ జి. జాషువకవి! నీదర్శనమున. ౧

చ॥ అకటవచింప జంకుదుమహాత్మ! భవద్రచనమ్ములేను పా
డుకొనుచునుండ 'వీనివినుఁడో' యనిదగ్గఱఁగూడియుండువా
రికిమఱి రెండుమార్లు పరిచరింపఁగఁ జేసినయట్టివారె నీ
దుకులము విన్నమీఁద తమతోవలఁజూతురి దేమి సత్కవీ!

గీ॥ కవితలకుఁగూడ కులములఁ గలుగఁజేసి
యించుమించుల నిటునిర్ణయింతురేని
ఇంతకమ్మని కవిత నీకెవ్వఁడిచ్చెఁ
జెప్పుమీఁకనాకు వాని శిక్షింతునేను. ౩

గీ॥ 'అంటి గూర్చుండి భోజనమారగింపు
మీవు నాతోడ'నని యాడవెవ్వనియును
కాని; కవితయు నింతటి హీనమయిన
పాడుభగవంతు నేమనువాఁడ సుకవి! ౪

గీ॥ గవ్వకును కానివారల కాళులయయొ
కత్తికోతల నొక మూలకొత్తుచుంట
తోడుకవినయ్యు ననరాని దాడవలసె
నలిగిపోకుము నన్నోమహాత్మ! నీవు. ౫

సీ॥ 'మనవాని కవితను మఱువంగ నే'ట్లంచు
సుకవిలోకమ్మంత శోకిలంగ
'జాషువా! సుధనింకఁ జాలించితే!' యని
రసపిపాసితులెల్ల విసముఁ ద్రావ
'ముద్దుపల్కుల నాదు మోహామేమగు'నంచు
తెలుఁగువాఙ్మయలక్ష్మి దిగులుబడఁగ
'ఎంత పోయితిమయ్యొ యేమంటి' మని నిన్ను
తిట్టువారికి నీవు తెలిసిరాఁగ
గీ॥ అట్టె; మఱుమాటఁ జెప్పక యలుకబట్టి
ధరణి కంపింప కలమును తన్న వేని
ప్రేమ నీఁ జూచువానికీ పిల్లకవికి
శాంతియుండదు; వింటివే? జాషువకవి! ౬

గీ॥ 'ఈర్ష్య'యను పిశాచ మదింతవఱకు
వ్యక్తులకె బట్టియుండె నటందుఁగాని
యదియు నేఁటికి పత్రికలందుఁ గూడ
పడియెనే యని యారాటపడుదు నేను. ౭
గీ॥ ఔర! నీమెడ చౌదరిగారు వేయు
ప్రశ్నలన్నియుఁ దనకు సమ్మతమనంగ
నావగింజంతయును వారి నాడలేదు
ఇంత విషమేల 'గృహలక్ష్మి' చెంత? సుకవి!
గీ॥ అట్టి గృహలక్ష్మి సాహసమంతరింప
వ్రాసినాఁడను నే 'బహిరంగలేఖ'

  

దాని కాదనునంత విద్వాంసు లెవరొ
చూచెదనుగాక! రానిమ్ము! సుకవివర్య! ౯

గీ॥ అంతటి బలవంతుఁడను నేనగుదొ కానొ
యనెడి సందేహ మీవెప్పు డందవలదు
తెలియరానట్టి యొక శక్తిఁ గలిగియుండ
నాంధ్రహృదయుండు కాఁడు దీనాత్ముఁడనఘ!

సీ॥ ఆంధ్రభాషాదేవి యడలుచుండుటఁ జూచి
'తల్లి! యెందుకె?' యన్న ధన్యుఁడెవఁడు?
పుట్టుదరిద్రుఁడై పుట్టి శ్రీనాథుతో
'ధనము పాప' మఁటన్న ధర్మియెవఁడు?
ప్రాణసమానమై పరఁగు గ్రంథమువీఁడి
మనము నోడకపోవు మానియెవఁడు?
భక్తిభావమ్మంది భవభారమును డించి
హరియందుఁ జెందుమహాత్ముఁడెవఁడు?

గీ॥ అట్టి బమ్మెరపోతరాజాన్వయమునఁ
బుట్టినాను కలమ్ముఁ జేఁబట్టినాను
ధర్మమునఁబోదు ప్రాణమ్ము ధారపోతు
నెవ్వరేమనుకొన్న నాకేమి? సుకవి! ౧౧

గీ॥ ఆంధ్రవాణికి ప్రతినిధినైన నాదు
'కలము తెలుఁగుఁభాషకు కళంకమ్ముఁగలుగఁ
జేయు నఁట' యైన నాకింతచింత లేదు
కాని నిన్నాడ నేనోర్వలేను! లేను! ౧౨

గీ॥ ఆంధ్రరక్తమ్ము నామేన నలరుచుండ
ఆంధ్రహృదయమ్ము నాయందు నణఁగుచుండ
ఆంధ్రదేశమ్ము నాగృహమ్మగుచు నుండ
ఆంధ్రభాషను నాభాషయనక పోను. ౧౩

సీ॥ గృహాలక్ష్మియే కాదు; కినిసి పత్రికలన్ని
తొడఁగొట్టి యుద్ధాన దుముకుఁగాక!
తక్కకవులే కాదు; ధరణి గెల్చిన మాదు
'చెల్లపిళ్ల'యె చేవఁజిమ్ముఁగాక!
ఆంధ్రలోకమె కాదు; యట్టె యొక్కమ్మడి
ముజ్జగాలే చుట్టుముట్టుఁగాక!
వారువీరే కాదు; వాణీవధూటియే
ధీరయై కచ్చబంధించుఁగాక!
గీ॥ 'జాష్వరచన యగమ్యగోచరము కాదు'
'తనదు తీర్మానమది మదాంధత్వ' మనుచు
మాఱుపోరాడి జయభేరిఁబగులఁదన్ని
విశ్వవిశ్వంభరాన స్థాపింతునేను. ౧౪

# కలంకకలము

ఆ॥ కలంతతోడ నిన్నుఁ గనుచు నీ చేతల
మఱలవేసి నిన్ను మందలించి
వారమైనకాదు బాలెంతయా చెల్లెఁ
గంటగించితేమి? కాటిభూమి! ౧

సీ॥ నిన్నుదూషించువాఁడను నేనె కాని
చెల్లెను; యశోదనింతయుఁ జెప్పలేవు
కోపముండిన నాపైనఁ జూపవలెను
గాక; యిదియేటిపాడి? కిగ్గాడి! కాటి! ౨

ఆ॥ ధర్మమార్గమందుఁ దవిలిపోవుటఁ జూచి
సంతసింతు్రికాని; పంతమూని
యనినకోలఁది నిల్లె; యంతకంతకు నింకఁ
జేసి చూపుదనుట సిగ్గుచేటు ! 3

సీ॥ పతిముందు మిక్కిలి భాషింపఁగాలేని
సిగ్గైన సాంతము చెల్లలేదు
'అది నాది నా'దని అక్క 'సీతమ్మ'తోఁ
బోరాడు బుద్ధియుఁ బోవలేదు
పత్రిమలకోసమై పట్టుబట్టలఁజింపు
నజ్ఞానమేనియు నరుగలేదు
తోడుపిల్లలఁగూడి దొడ్డిలో నాటక
మ్మాడు మాటనుకూడ వీఁడలేదు

గీ॥ అట్టి మాచెల్లెనప్పుడె పొట్టఁబెట్టి
పుట్టబుడుతఁడు కలిగియు గిట్టినట్టి
వానిఁజేసితివింతకు హీన మొండు
కలదె? యెచ్చోటనేనియుఁ గఠినహృదయ! ౪

ఆ॥ "ఇంతగోల లేఁత యిల్లాలిపుస్తెలఁ
దెంపనగునె? యిల్లు తెంపుఁజేసి
నిన్నఁగాక నామె మొన్నఁదాల్చెను కాదె
యింత పాపమున్నె? యెందునేని!" ౫

గీ॥ అనుచు కూడనిచోట 'త'యక్షరమ్ముఁ
గూర్చి, యేమెఱుగని నిన్నుఁగోపగింప
నేమిలాభము? కాటి! నే నెంతపాప
కర్ముఁడను నాకలమ్మది కాలిపోను. ౬

---

# ఆ వే ద న ము

గీ॥ పండుటాకుల నన్నిటిఁ బాడు సేయు
మైన నున్నది ధర్మము; కాని యొక్క
పచ్చనాకునె యటు సేయఁ బాలుపడిన
లేదు ధర్మము సుంతయు లేదు దేవ! ౧

మ॥ అదియేమో మఱువంగరాదుమదిలో నా వేదనమ్మంతకున్
బదిలమ్మై నను కాల్చివేసెడిని ఏపాపమ్మునుం జేయలే
నిది; మా చెల్లెను; మాయశోద నిటుకానిమ్మంచు నిర్భీతిమై
పదునై దేండ్లకె మంటఁగల్పితివిగా భావ్యమ్మె? నీకీశ్వరా!

చ॥ తనయులఁ గోరిభూమిఁగల దంపతులెందఱో మెన్నొనీళులన్
మునుఁగుచు; చూచుబండలకు మొ్రొక్కులఁ బెట్టుచు నింక నేమి సే
సిన నిసుమంతయేని దయసేయక కోర్కెయె లేని చెల్లెకీ
చినతనమందెయిచ్చియిటు సేయఁగఁజూచితివేమి? నాప్రభూ!

ఉ॥ పుట్టినవాఁడదే! కుతుక బొంగురువోవఁగ నెందుకోసమో
బిట్టుగ నేడ్వసాఁగె; కనిపింపదు సోదరి యేమిసేతు నె
ప్పట్టున నేని తల్లిచనుపాలకు నోచఁడు వీనినెట్లు జో
కొట్టెదా! నీదెభారమిఁక గోపకుమారక! రామకృష్ణుఁడన్.

---

## రహస్యోక్తులు



ఆ॥ నిన్నుఁ గూర్చి నేను గొన్ని రహస్యంపు
వాక్యములను జెప్పవలసియుంట
నన్ను నీవు సాఁగనంపెదు రమ్మని
కొనుచు వచ్చితింక వినుము కర్ణ! ౧

ఉ॥ కన్నియనాఁడు గొంతి తనకాంచిన సిద్ధవరమ్ముచేత ని
న్గన్నది సూర్యుఁ బొంది; యటుకావున నీవిఁక పాండవేయులన్
మన్ననఁ జూచి తమ్ము లనుమాటకు నేనియు వారిఁ జేరి య
త్యున్నతి సౌఖ్యడోలికలనూగుము; చూడుము ధర్మ [మార్గమున్.

సీ॥ యువరాజుగానుండి సువిచారముగ నీకు
యమనందనుఁడు చామరములవీచు
భీమసేనుఁడు నీకు ప్రేమవాటిల్లంగ
విమలమైన సితఛత్రిమును బట్టు
సవ్యసాచియు మహాసంభ్రమమ్మున నీదు
రథము నవరించి సారథిగనుండు
మాద్రేయులిర్వురు భద్రసంగతి నీకు
నంగరక్షకులౌచు నలరుచుందు
గీ॥ మఱియు; నభిమన్యుప్రభృతి కుమారతతియు;
పాండ్యవర్గము; యాదవబలము; తక్కు,
రాజలోకము; నిను భక్తిఁ బూజసేసి
దండములఁ బెట్టు నీపదద్వయికి; కర్ణ! ౩

ఆ॥ పాండునందనులకు పత్నియౌ పాంచాలి
నిన్నుఁ గూడ నల్లెమొన్నుకొనును
మాతృదేవి యడలుమాని సుఖించును
నేను నిన్ను గొలుతు నింక రమ్ము! ౪

# స్వామిభక్తి

గీ॥ స్వామి! యభివందనము నీకు; భూమిభరము
నడపవచ్చితి వీవు గొల్లఁడవు కావు
దేవదేవుఁడవని నాకు తెలియు నయిన
నీదుహితము వినమికి మన్నింపునన్ను. ౧

గీ॥ మహిమఁదనరారు వేలుపు మాంత్రికుఁడవు
తొడరి క్రీడికి రథమును నడుపుచుండు
నీదుముంగల గెలువంగరాదు నాకు
నయిన రాజాజ్ఞచేఁ జేతు నాహవంబు. ౨

గీ॥ 'కర్ణుఁ డనువాఁడు కుంతికెకాని రాధ
గర్భమునఁ బుట్టు పుత్రుఁడుకాఁ'డటంచు
మాధవా! విందు నైన నా మనముమాత్రి ౩
మీ నుడిని పాటి సేయ దే నేమిసేతు?

గీ॥ నాఁడు తనకట్లు నాపుట్టునాఁడు నన్ను
పాడివిడనాడి గంగమ్మ పాలుసేయు
గొడ్డురాలికి కర్ణుఁడు కొడుకఁటన్న
నవ్విపోదురు నల్వురు నలిననాభ! ౪

గీ॥ తనదు మూత్రపురీషాదులను భరించి
చదువుసంధ్యలు సెప్పించి సాకునెవతొ
ఆమెనే వాఁడు నాతల్లి యనునుకాని
కని త్యజించెదు పుణ్యాత్మ ననఁడు వింటె! ౫

గీ॥ జాతకర్మాది విషయ సంస్కారములను
నిజకులోచితముగ నాకు నెఱపుతల్లి

దండ్రులకు నేను పుత్రకృత్యములు చేయ
కెట్లువత్తునో? సెప్పవమీవే మహాత్మ! ౬

గీ॥ మగలనేవురఁ గలిగియు సొగసుమీర
నన్ను నాఁబవహానిఁగ నెన్నుకొనెడు
సాధ్వికేతీరునందు పసందె కాని
మానవేశుని నెచ్చెలి నేను కృష్ణ. ౭

గీ॥ వినుము పాంచాలియను లంచమునకు బ్రమసి
వశ్యుఁడనుకాను నా సహవాసబలమె
నమ్ముకొనియుండు రాజును వమ్ముసేయ
నాత్మఁ దలఁపను రాను మహాత్మ! నేను. ౮

గీ॥ కూడదిది; నాకు మిక్కిలి కూర్చువాని
కయమొ నాస్వామికింత ద్రోహమ్మొనర్చి
సంబరమ్మున నేఁడు పాంచాలిపొందు
నాసఁజెందను పాపము వాసుదేవ! ౯

శా॥ నేనే నీవని నీవ నేనని మదిన్ లెక్కించి స్నేహాన స
మ్మానమ్మొప్పఁగనంగరాజ్యమును ప్రేమంగూర్చినాకర్ణ నా
ప్రాణమ్మా! నను కౌఁగిలింపుమను నా ప్రాణమ్ము నానాకురు
క్ష్మానాథున్విడి నేను వచ్చుట లశక్యమ్మయ్య! గోపాలకా!

గీ॥ యమతనూభవుతో నీరహస్యమీవు
సెప్పఁ జూడకు మాలమ్ముఁ జేయఁడతఁడు
నీదుపూన్కియుఁ బూర్తిగ కాదుకాన
తెలుపఁబోకుము నాకింక సెలవు కృష్ణ! ౧౧

# రా ధి క

గీ॥ నీకు దండమ్ము నిడుకోర్కె నిక్కువమున
నాకు కలుగదు కాని, యీ నాఁడు నీదు
స్నిగ్ధరూపమ్ముఁ జూచి నా చేతులిటుల
యేకమై పోవ కారణమేమి ? కృష్ణ ! ౧

గీ॥ ఈవు నాయింట నున్నప్పు డేమొ నిన్ను
నుంతయును గౌరవింపఁగ జూడనయిన
నిన్నుఁ జూడనినాఁడు కన్నీరు గార్తు
నిందు దాగొన్న సూత్రమ దేమి? దేవ! ౨

గీ॥ నా పదమ్ములు నీ కాళ్ల మోపునపుడు
తప్పుగా నేను నామదిఁ దలఁపఁగాని
పిదప 'ఈచేత పాపమే కద!' యటంచు
బాధఁ జెందుదు నేల? గోపాలబాల! ౩

చ॥ ఒడయఁడ! లోకులెందులకొ
యోర్వక నన్నొక అంకుటాలిఁగాఁ
దడఁబడ నాడిపోయుదురు
దాన నిఁకెన్నఁడు నీవువచ్చినన్
నుడువులనాడ కాని అయొ
నొచ్చెనొ యేమొకొ యన్నమాటనే
నడుకొని నీ పదద్వయిని
నా కుచసీమను మోపి యొత్తెదన్. ౪

# ప్రకృతి మాహాత్మ్యము

గీ॥ స్త్రీలనేకులునాకు లంచా లొసంగి
నాదు పరిచయ మర్థించునాఁడు కూడ
'ధర్మమనుమాట నొక్కింత తప్ప'ననుచు
నేను జెప్పంగవలె నేమి? నీకు; ప్రకృతి! ౧

* * * * *

గీ॥ సూరబాల నరయఁగ వసుంధర యన
నేమొ యెఱుఁగదు మఱి, కవయిత్రి కాదు;
నాదుమాటను నేఁ జెప్పరాదఁటంట
అయిన మామైత్రి కే మర్థమమ్మ? ప్రకృతి! ౨

గీ॥ ఆఁడువార లెయడుగ భయమ్మునందు
ముచ్చటలఁగూడ నెన్నొ నా ముందువచ్చి
సెప్పుచుండును 'సూర' నిశ్చింతతోడ;
యింతహృదయమ్ము నాకిచ్చితేల? ప్రకృతి! 3

గీ॥ ఒంటిగా 'సూర' నాచెంత నుంటఁజూచి
పప్పుకళ్ళన తను రద్దిపాలు సేయ;
మఱలననుఁ 'జీఱి' బావిని 'పడుదు'ననుచు
నేడ్చె, మా'సూర' యీవింత నేమి? జనని! ౪

గీ॥ జనము లనుమాట పదిదివసమ్ములేను
తమదునిలుఁ జూడకున్న; యసమయమందు
నన్నుఁ బిలిపింప నేను రాననుడు సూర
నేలఁ గన్నీటఁదడిఁ గట్టనేల? ప్రకృతి! ౫

గీ॥ ఇంత యపవాదమందేఁగి యేను 'సూర!'
యనుచుఁదనుఁ బిల్వ; వచ్చినన్నరసి 'యేమి?
సెప్పు'మని రెండు పెదవులఁ జప్పరించు
ప్రకృతి! నామాటకింతటి బలమదేల? ౬

* * * * *

గీ॥ సూరబాల మనము పరిశుద్ధమనెడి
నాదు కన్నీట నీఁక నో జనమ్ములార!
యంతరంగాల ప్రకృతి మాహాత్మ్యమునకు
తలలవాల్చుఁడు; ధర్మంపుదారిఁ గనుఁడు. ౭

గీ॥ ఓయి! కృష్ణుఁడ! నీవు లోకోక్తుల విని
వేఱె తలఁచిన నీఁక మది వీఁడవలయుఁ
గాక; సాధ్విని సూరను కాదనునెడ
భీషణమ్ముగ నిన్ను శపింతు సుమ్ము! ౮

గీ॥ ఏమి నావెఱ్ఱి! నిను శపియింతునేని
సూర; యిది యే మనుచు నన్నుఁజూచునపుడు
నాదు మనమేడ్వకుండఁగఁ బోదు కాన
అట్లు రాకుండ నిను దేవుఁడరయుఁ గాత! ౯

---

# అ భి మా న ము

గీ॥ శంతనుకుమార! నినుఁజూచి సాహసమున
యట్టె! నా యడిగెడువాని కన్నిటికిని
తగినరీతిగ నీక సమాధానములిడి
నీదు పెద్దతికమ్మును నిలుపుకొనుము. ౧

గీ॥ కర్ణుఁ జూపించి యాతని దుర్నయమ్ము
నాంబికేయుని ముంగల నాడునీదు
మాటలనువిన్న నిన్ను నా మానసమ్ము
కినిసిపోయెడి నంట; గాంగేయ! వింటె! ౨

గీ॥ నేనుపెబ్బను; నాఁ జెప్పుదానికెవరు
ప్రతివచింప రనెడి పరాకునంది
కర్ణునకునీకుఁ గలుగుదూరమ్ముఁ గనక
యేమొ ప్రేలిన మాత్రాన నేమి? ముసలి! ౩

ఉ॥ గోగ్రహణమ్ముపట్టుల న
కుంఠిత తేజుఁడ వీవె యుద్ధ సా
మగ్రిని వీఁడి మూర్ఛఁబడు
మాటఁ దలంపక సూర్యనందనున్
ఆగ్రహమూని పౌరుషము
లాడిన నేమి ప్రయోజనమ్ము? నీ
విగ్రహపుష్టిగడ్డమున
వెట్టులఁ జేయుదె? మమ్ము; భీష్ముఁడా! ౪

ఆ॥ ఘోషయాత్రలోన కురునాథు విడనాడి
కాలిబలముఁజూపె కర్ణుఁడనుచు
గేలిసేయు నీవు గెలిపించుకొనఁబోవు
మఱి సహింపరాని మాటలేల?

ఆ॥ 'మించివచ్చునపుడు మేటి వీరుఁ డొకప్పు
డొఁడుదానికైన నోడువాఁడె'
యనెడి ధర్మసూత్రి మరసియు నీవిట్లు
కర్ణుఁ దిట్టనేమి కర్మమయ్య?

గీ॥ 'ఆలమందున నే నెప్పు డాయుధమును
బట్ట' 'నను కృష్ణుఁ జక్రమ్ముఁ బట్టఁజేయు
వీరుఁడను నేనె' యను నీదు బింక మెంత?
కర్ణుముందఱ గవ్వకుఁ గావు నీవు!

గీ॥ ఇంక వారలు నీతోడ జంకులేక
గదిసి పోట్లాడిరేకాని కర్ణుఁజూచి
'బ్రతికియుండిన శుభములఁబడయవచ్చు'
ననుచు వచ్చినదారిని జనరె? ముసలి!

గీ॥ 'నన్నుఁ గర్ణుఁగను'మని సేనానివగుచు
చంపఁదగినట్టివానికి; శాత్రవునకు
'పట్టు'మని యట్టె యాయువుపట్టువిచ్చి
స్వామిప్రాణమ్ములం గోరిలవేమి? నీవు.

గీ॥ 'ధర్మజునితోడ యుద్ధ మధర్మ' మనుచు
జెప్పువాఁడవు నేనది సేయననుము
బోఁదలంచిన మఱియందె పొమ్ము కాని
యింతదోహమ్ము నోడిఁగట్టనేల? కుమతి! ౧౦

ఆ॥ ఇట్టి దోహచింత యినసందనుని చెంత
నుంతయేనినీవు సూపలేవు
అంతెకాదు; భీష్ముఁడతని సేవించియే
స్వామిభక్తి నేర్వవలెను; వలెను, ౧౧

ఆ॥ జామదగ్న్యుఁడిచ్చు శాపమ్మునెడువహ్ని
మనమునందెబెట్టి మానవేశు
జీవములను నిల్పఁజేసిన కర్ణుని
స్వామిభక్తికెవఁడు సాటి? సెపుమ! ౧౨

ఉ॥ మీసము గడ్డము న్నరయు
మీఁద భవాదృశు లే వనమ్మునో
మూసిన ముక్కుఁగల్గి జప
ముల్ తపముల్ కడు నిష్ఠతోడుతన్
జేసి రమామనోవిభునిఁ
జెందుదు రంతియకాని యెక్కడన్
మోసపుపోకలందుఁ బడి
పోవఁగఁ జూచెదరే నదీసుతా! ౧౩

---

# కడుపుచిచ్చు

శా॥ అన్నా! పాపిని నేమిసెప్పుదు? రహస్యమ్మింక నీ భంగినే
నెన్నాళ్లెట్లు భరించి దాచెదను? నేనే; తల్లనే; కర్ణు నీ
యన్న న్నంతటి దానరాజును రణన్యాయైకదక్షుం గటా
మన్నైపోవఁగఁ జేసితిన్ వినవె! నన్మన్నింపవే! ధర్మజా! ౧

ఉ॥ నా సరివైనపూజకు మనమ్మున సంతస మంది నాకు దు
ర్వాసమహర్షి యిచ్చినవరమ్మున సూర్యుమదిం దలంచినే
నా సుకుమారగాత్రుఁ దనయా! ప్రసవించితి; మంద భాగ్యనై
బాసితి; నాదుమానసము బ్రిద్దలుకాదిఁక నేమి సేయుదున్?

శా॥ ఆ నా పుత్త్రునిశీల మెంతటిదిరా! ఆనాఁడు నే వానితో
నేనే తల్లిని; రాధకాదు; నిను నేనే కంటి; నిందింపక
న్నా! నా కప్పుడు పెండ్లికాదనఁగనే నంజూచి లజ్జించి నే
కానీనుండనె? యన్నప్రశ్నకిపుడుం గంపింతు నే నెంతయున్. 3

చ॥ తడఁబడుచుండు మాటల వదాన్యుని వానిని నీవు దానక
ర్ణుఁడవని కొంగుఁజాపిన ననుం గృతకృత్యను నేసినట్టియా
నుడులు తలంపుఁజేరినను నూఱువిధాలఁ గలంచుచున్నవి
ప్పుడు వినిపింపలే నయయొ పోయెనె? కర్ణుఁడుసచ్చిపోయెనే!

చ॥ శమనజ! వేడుకొందునిను జాగొనరింపక యింకనీవు నీ
దుమనముతోఁ దిలోదకపుదోసిలి కర్ణున కన్నకిమ్ము స్వ
ర్గమునకు నిర్గమించును సుకమ్ములఁ బొందును దానకొంతనా
దుమనములోనివహ్ని యనుదూరమునందునుపుణ్యామబ్బెడిన్

---

# ధర్మజవిషాదము

గీ॥ ఏమిమాటలఁ జెప్పెదు ? నీ మనమది
కలఁత పడలేదు కద ! వెండి కర్ణుఁడనెడు
వ్యక్తి నెన్న; నిజమున నా కన్న యనుదె ?
కుంతి తొలిచూలు నందలి కొడుకెతల్లి ! ౧

గీ॥ అతని ముఖలక్షణములు నీ యట్టులుండ
నేమొకో యని సంశయించుచుందు
నంతియే కాని కర్ణు నీ యాత్మజునిఁగఁ
దలఁపలేనైతి, నా బుద్ధి తగులఁబెట్ట. ౨

గీ॥ ధార్తరాష్ట్రునితోడి జూదమ్మునాఁడు
నేమొ యాడిన తనదు సహింపరాని
మాటలకు కర్ణుపట్లు; నా మనము నేయు
కోపభర మింతయును జెందకుండుఁగాక 3

గీ॥ కౌరవుఁడు సేయు దుర్నయకార్యములకు
పట్టరానట్టి కోపమ్ము పుట్టుఁగాని
కర్ణువదనమ్ముఁ గనుఁగొన్న క్షణమునందె
మఱచిపోదును నా కోప మంత నేను. ౪

గీ॥ 'పార్థ ! కర్ణునిఁ జంపక వచ్చితేని
నీవు నాకిఁక తమ్ముఁడ కావటంచుఁ
గత్తిఁగోసితి; సోదరఘాతి నైతి
నేల సెప్పవు మొదటనే ? కాలనేమి ? ౫

గీ॥ అన్నరక్తానఁ గలిపిన యన్నమనుచు
తెలియనేరక కడుపార తింటినేను
దేవుఁడా ! నాదుపాపమ్ముఁ బోవఁజేయు
మార్గముండినఁ జూపు మే బ్రతుకలేను. ౬

గీ॥ అగ్రజా ! నిన్ను సూతజుఁ డనుట తప్ప
సూర్యసుతుఁడని తెలియ; నీ శుద్ధమైన
యాత్మ నా యిచ్చుచున్న బాష్పాంజలిఁగొని
యీ యధర్మజునకు శాంతి నిచ్చుఁగాక ! ౭

గీ॥ నిన్నుఁబోలెడి వీరుఁడు నిశ్చయమున
పుట్టలేదన్న ! మఱిసూడ పుట్టఁడన్న !
పావనమ్మైన నీమైత్రి స్పర్శనంద
నేమి నోచెనొకో కౌరవేశ్వరుండు ! ౮

గీ॥ ఇంతవచ్చుట పాపినీకుంతి! దాచు
దానిచేతనెకద ! యింక ధాత్రియందు
నాఁడువారల నోట రహస్య మాఁగ
కుండెడిని గాత ! మఱి యాఁగకుండుఁగాత ! ౯



# పీ ర పూ జ

గీ॥ సూర్యభగవానునం దొక సూర్యుఁబోలె
కవచకుండలఁములదాల్చి యవతరించి
రాజరాజున కాలవ పాఠిణమైన
కర్ణ కాయమ్మ! యొకమాఱు కానరమ్ము. ౧.

గీ॥ నెత్తిపై కెత్తిచూచిన నింగికలదు
తలను క్రిందికిఁ ద్రిప్పిన ధాత్రికలదు
ఉండవలసిన వన్నియు నుండియుండ
కర్ణకాయమ్మ! నీవేల కానరావు? ౨.

గీ॥ పాండవేయుల శిరముల భండనమునఁ
జెండులుగ నొక్కటొక్కటిఁ జెండుదనుచు
మండలమ్ముల నీ కీర్తి నిండిపోవ
బెండగిల్లితె? దోర్దండమండనుండ! ౩.

గీ॥ భారతామ్నాయమును చేతఁబట్టి నీదు
సమరమందలి యవలి దృశ్యమ్ముఁజూడ
నాదు మనము కిరీటిని నమలి తినియు
శాంతినందదు; వినుము! నిజమ్ము; కర్ణ! ౪.

గీ॥ వాసిమోసిన నీదు ధన్వమ్మునుండి
వేగ పరుగెత్తి పోయిన నాగమయ్య
కాలఁ గ్రిడి కిరీటముఁ గూలఁ దన్ని
మఱల నను విడుమన నేమి నెఱపితన్న! ౫.

గీ॥ కవచకుండలముల నీవు కలిగియున్న
తనదు కొమరుఁడు నీచేత తప్పుననుచు
తలఁచి దేవేంద్రుఁడొక తొలికొలపుటయ్య
వేసమున వచ్చి నీ కొంపఁదీసె; కర్ణ! ౬

గీ॥ భూమిఁ గ్రుంగిన రథమును మూపుఁజేర్చి
లేవనెత్తుచునుండ బలేనుగండుఁ
బోలె పార్థుఁడు నిను నేలఁ గూలనేసె
నింతకన్న నన్యాయ మింకేమి కలదు? ౭

గీ॥ 'దానరాజున కీవు రథమ్ము నడపి
మానరాజేంద్రునకు; నాకు; మాననీయ!
జయముఁగొని ర'మ్మనుచు రాజు సాగనంపు
శల్యుఁడే; సారథియె నిన్ను సగము సంపె. ౮

గీ॥ ఇట్లు నీవారు పగవారలట్లు నిన్ను
మోసగించిరెగా? మృతుఁజేసినారు
దీనికై యింత నీవు చింతింపఁదగదు
'దానరాధేయుఁ' డను మాట ధాత్రికలదు. ౯

గీ॥ సన్నవానిఁగ నానాఁడు నిన్ను భీష్ముఁ
డాడుకొనినట్టి మాటల కలిగి, యతఁడె
పట్టుమనుదాఁక బాణము ముట్టలేదు
బట్టబయలౌను దీన నీపట్టు; కర్ణ! ౧౦

గీ॥ 'రాధ కొమరుఁడె రారాజు సౌధమునకు
నగ్గిముట్టించి వంశము బుగ్గిచేసి

నాఁడనుచు నిన్ను లోకమె ప్డాడిపోయుఁ
గాక! యదియేమి? కాకులమూఁక; కర్ణ! ౧౧

గీ॥ ఉప్పుఁదినియుంట కా రాజు నప్పుఁదీర్చి
యరిగితివ కాని మగలైదుగురను కలుగు
పాండుకోడలి కాఱవమగఁడ కావు
నీకు సూతజు పేరె నాజూకు కర్ణ! ౧౨

గీ॥ భూమిపాలుని యన్నమ్ముఁ బొట్టపగుల
మెక్కి తుద కింటివాసాల లెక్కబెట్టి
పోవుద్రోహుల జోలికి పోరు కాని
నీదు నీడయ బెల్లపునీరు, కర్ణ! ౧౩

గీ॥ 'కర్ణునకు పాండవేయు లాక్రిందు'లనుచు
నెన్నఁడో తెలిసియు మఱి నీవు గడ్డి
పోచలంబోలె వారలఁజూచినావు
బల్లగుద్దెదె? యది నీదు స్వామిభక్తి. ౧౪

గీ॥ ఆలమందలకై వచ్చు నర్జునునకు
నాల మొనరింపఁ గర్ణుఁడు సాలఁడనుచు
కొంగ తేద్తురు నాకు పసందు కాదు
దాడి పెంచిన శూరులు నోడరేమొ! ౧౫

గీ॥ నేఁడు కర్ణునిఁ జంపెదఁ జూడుమనుచు
నన్నముందఱ పెగ్గెల నెన్నొగొట్టి
నీ మహామూర్తి ననిఁ గని నీళ్లు నమలి
పప్పులోఁ గాలువేయఁడే ఫల్గునుండు. ౧౬

గీ॥ నీదుమగటిమి కాలమ్ము లేదు కాని
లేకపోయిన పేడిదిమాకితలను
కాకిగ్రద్దల కడుపున కరఁగఁజేసి
యానఁ దీర్పకపోవుదే? యంగరాజ! ౧౭

గీ॥ బలముగల యట్టి తమ్ముల నలువురఁగని
యమసుతుం డొక్కనాఁడేని హాయితోడ
నిదుర పోలేదు నీ చచ్చుపిదపఁగాక
దీన నీ వెంతవాఁడవో తెలియు మన్న! ౧౮

గీ॥ దీనగతి నీవు కూల నీ తేజమొండు
కనులు మూతలుపడ సూర్యుఁ గలియు నపుడు
వైరివర్గమె మఱి నమస్కారములను
సల్పె; నది సెప్పదొకో-నీయశమ్ము కర్ణ! ౧౯

గీ॥ కుంతి కొంగున ముడివేసికొనఁగ నిచ్చు
పరము నావంతయేనియు మఱచిపోక
కదనమంతయు ననినట్లుగానె నెఱపి
జయముగొనినావు; వగపేల? సత్యమూర్తి! ౨౦

గీ॥ నీవు చచ్చిన తరువాత నీదుపుట్టు
పూర్వమంతయు నా కుంతి పూసగ్రుచ్చి
తెలిపె ధర్మజునకు తిలాంజలి నొసంగ
నప్పుడాతని యేడ్పులఁ జెప్పనెట్లు? ౨౧

గీ॥ గొంతికడుపునఁబుట్టిన కొడుకులందు
కర్ణుఁడొక్కఁడె పూర్ణ శౌర్యార్ణవుండు

అట్టివాఁడింక నాకెన్నఁడన్న కాఁగ
పుట్టునని నెత్తి గోడకుకొట్టె; కర్ణ! ౨౨

క॥ తెలియక పలుచని పలుకులు
చిలుకలవలె పలుకుచుందుర్ చీఁదఱఁ గొలుపక
తెలిసిన కలములు మఱఁగునె?
చిలుకవె? విలువిద్యవిలువఁ జేకొని; రవిజా! ౨౩

గీ॥ మనదు నిద్దఱి దూరమ్ముఁగనియు నల్లె
'కర్ణునకు నీకు స్నేహమ్ము కల'దటంచు
బూటకపుమాటలాడిన పాటియేమి?
బుద్ధిమంతులు దీనినమ్ముదురె? కర్ణ! ౨౪

గీ॥ ఎన్నఁడో మన్నుఁగలసిన నన్ను నేఁడు
నిట్టి యభిమాన మంచి యూఁకొట్టఁజేతు
రెవరొకో యంచు నీవు నూహింతువేమొ
అయినవినుమయ్య, సెప్పెదు భయములేదు. ౨౫

గీ॥ వాసిగడియింప నుండు నా వ్యాసములను
ధర్మమునకు నీళ్లువదలి దాచివేసి
ప్రాణములఁ బాయు మా యాంధ్రవాణితోడ
మఱి వచింపుము నా మాటమఱచిపోక. ౨౬

గీ॥ ప్రాణములఁ బాసిపోయిన ప్రాణికోటి
కాయములఁదేల్చి బ్రహ్మకు కన్నుగుట్ట
జీవములఁబోయునట్టి సంజీవిగాఁగ
కలముగలిగిన కవికి శిష్యులము మేము. ౨౭

# కవితా పిపాస

గీ॥ కవివతంసమ! నీదు భాగ్యమ్ముఁ బొగడ
బ్రహ్మదేవునకైనఁ దరమ్ముకాదు
ప్రీతి నీతీరు ధాత్రినే నాటిమిన్న
నోముఫలముగఁ బుట్టి తనుజ్ఞనిమ్ము.

గీ॥ కరుణ ననుఁ జూడు మిదె నమస్కారమేను
జేయుచున్నా నహహా! నీదు జీవితమ్ముఁ
గాంచి; నీదుకులమ్మునఁ గలుతు; నన్ను
కవినిఁగాఁ జేసి పుణ్యమ్ము గట్టుకొనుమదె!

శా॥ ఓయీ! యేమనుచున్నవాఁడవిపుడో హా నిన్ను పేర్మింగవిఁ
జేయంజూచిన నీవు కావు విను చింతింపంగ నెవ్వారలేఁ
నీయీకోర్కెను పూర్తిజేయరుగ; కించిత్తైన భూమింగవిం
జేయఁ రాదతఁడట్టివాఁడెయయిజన్మించుంజుమీయందు వే.

మ॥ వినుమట్లైనచో నీవు మానవుఁడవే
విశ్వమ్మునం దల్లి మ
న్ననన నీకుంగల దింకఁ జెప్పు; పురిటిం
టంబుట్టునా డెట్టికై
తను వ్రాయం దొరకొంటి? నీవు సుకవీం
ద్రా! చూడు మే గట్టివాఁ
డను నీవేసముఁజూడ కే మఱలువాఁ
డంగాను ముమ్మాఁటికిఁ.

గీ॥ అదిగో! అదియేమి? యిట్లు నన్నరసి నీవు
కారణమ్మింత లేకయే కడుపుపగుల
నవ్వుచున్నాఁడ వెందుకు? నాదు ప్రశ్న
నీకు హాస్యమ్ముగాఁ దోఁచెనా? కవీంద్ర! ౫

గీ॥ ఏమి? నిజమొకో! వలదయ్య! యీవు నన్ను
కవినిఁజేయుట నిక్కంపు కవిని గాక
నేను కృత్రిమపుష్పమ్మనేని కవిత
రాదు కవినగు కోరిక లేదు నాకు. ౬

చ. సదయుఁడ! నీపదమ్ముల నొసంగుము చాలును; నేనుచింతఁ బా
సెదనిఁక నీదు లేఖిని రచించిన యా నును లేఁత నైన నీ
పదములు పిండు తేనెల నపారముదమ్మునఁ ద్రావి త్రావి నా
హృదయముదప్పిదీర్తునతరింతునునిన్నుస్మరింతునిచ్ఛలున్ ౭

———

# ఉపహారము

## భోగినీదండకము పోతన విరచితమేనా?



'౧౯౧౭' వ సంవత్సరమున వావిళ్ల ముద్రాక్షరశాలయందు ముద్రిత మయిన భాగవత గ్రంథములోని శ్రీ శేషాద్రిరమణ కవుల విమర్శనము నంతయుఁ జదివినాను. అందు వారు 'భోగినీదండకము' పోతన విరచితమని నుడివినారు.

పండిత కీర్తనీయుఁడగు బమ్మెర పోతన యా సుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకముం రచించె బహు దాన విహర్తకు రావుసింగభూ
మండల భర్తకుం విమత మానవనాథ మదాపహర్తకుం.

అని, యాదండకాంత్యమున పోతన వ్రాసికొనినట్లీపద్య మగుపడుచున్నది. దీనియందే గాక యాతని శైలి పోకడ లాదండకమందుఁ గూడ కలవట. ఆటకేమి ? కలవు. కాని నాయంతరాత్మమాత్ర మిది పోతన వ్రాసెనను నుడిని యంగీకరించుట కింతయును సమ్మతించుట లేదు.

సర్వజ్ఞసింగ భూపతి తాను వ్రాయు రసార్ణవ సుధాకరమునందు తన జననినామము 'అన్నమ' అని తానొకటి సెప్పుకొన, యీ దండకమున 'పోచమ' అని వేఱొకటి యుండునప్పు డది యా యమకు నామాంతరమేమో అని యూహించి యూరటబడు శ్రీ శేషాద్రి రమణకవులు, భాగవతమును చదివినవారెవరో యొక రా శైలి ననుకరించి యా దండకము

 

పోతన వ్రాసినట్లు కావించియుందురేమో అని యేల భావింపరాదు? నాకు తెలియక యడుగుచున్నాను. అది భాగవతమునకు ముందేయున్నదని నిరూపించుట కెవరికేని యేదేని యాధారమున్నదా? స్వర్గీయ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారుకూడ 'అది యా యమకు మాఱుపేరుగా నేల తలంపరాదు? వెలుగోటివారి చరిత్రయు సింగభూపాలీయమును చూచిన యెడల వీరి వంశమందు నొక్కొక్క పురుషునకు మాఱుపేళ్లు పెక్కు రకుఁగలవు. ఉదాహరణార్థము - యాచమ (దాచా) అనంత (అనపోత) మాచా (మాధవ) దేవగిరి (సింగ) శివ (ధర్మరాయ) ఇట్లు పురుషుల పేళ్ళ కెన్నియో మాఱుపేళ్ళుండ స్త్రీలకు మాఱుపేళ్ళుండుట యాశ్చర్యము లేదని నారు. కాని యిప్పటి చర్చనీయాంశము పురుషులనుగుఱించి కాదు. అన్న మను. ఈ యమ స్త్రీ, పురుషుఁడుకాదు. కావున సింగయ వంశమ నందున కొందఱి స్త్రీలకుఁగూడ మాఱుపేర్లను చూపెంచి, యీ పోచమ నామమును సమర్థింపవలయునే కాని పురుషుల నామముల నుదహరిం కాదు. వారి వంశమునందున పురుషులకు మాఱుపేర్లు లేవని యెవరు వాదింపరు. కావున నిది యనవసరప్రసంగము.

అయిన 'పోచమ' అను పేరు కేవలముగ నున్నందున (అట్లు సెప్పి రెవరు?) 'పోచమ్మ' అనగా పోరిచు అమ్మ అని యర్థము చేసికొని (ఇం చుట్టు తిరుగు ప్రయాస మెందులకు?) దానికి సంస్కృత రూపమ 'అన్నమ' అని కల్పింపఁబడి యుండును. అని లక్ష్మణరావుగా రనినారు ఇందలి 'యుండును' అనుట యూహాజనిత మనుట స్పష్టమేకదా అయిన 'బమ్మెర' భ్రమణశబ్దభవము. బమ్మెరవా రనగా భ్రమణము సేయు వారు అని యర్థమేల చేసికొనరాదు? బమ్మెర యూరుపే రనియు నింటి రనియుఁ జెప్పనేల? అను ప్రశ్నములకు బమ్మెరపేరున నొండు గ్రామము కలదని. కావున యీ సృష్టి కూడదని శ్రీ లక్ష్మణరావుగారే కదా దానిని కొట్టివేసినది? ఇట్టియెడ, సింగయయే తల్లిపేరు 'అన్నమ' అని

వ్రాసికొనినా డనియు కావున 'పోచమ'వ చేయు యీ తర్కము కూడ పనికిరాదని నే నేల చెప్పరాదు ? ఒక పేరునకు సరిపోయెడి యర్థమును నిరాకరించునపుడు రెండవది కూడ యట్లనే నేయవలయునుకదా ? మఱి యీ హేత్వాభాసమేమి ?

దండకములోని 'పోచమాంబా లసద్గర్భసంజాతుపై' అను పదముల కర్థము పోచమాంబ గర్భమందుఁ బుట్టినవాఁడనుటగాక వేఱే యేమి యును లేదు. అయిన మూలజనయిత్రియగు పోచమాంబా సంతానమని యింకొక యర్థము చేయవచ్చుననుట యెట్టిది? ఎట్లు? 'పోచమాతా గుణోదారా' అనునదుదహరించి ఈయమవిషయమై యీ వంశమువారికి నెక్కుడు భక్తియుండెననుట కీ ముత్తాతభార్యను 'మాతా'యనుట నాలోచింపఁదగినది కాదా? అని అడుగుచున్నారు. ఔను; ఈ మాతపద మా పోచమయెడ వీరల కమితభక్తి కలదని చాటుచుండెననుట స్పష్టమే; ఒప్పుకొందును. కాని యా పోచమ యెడ వీరి కెవరికిని భక్తి లేదని వాదించు నప్పుడే తప్పు దీనికిప్పుడేమి ప్రసక్తి? ఏమి! భక్తికారణమ్మున పోచమ అన్నమ యగునా? అన్నమ పోచమయగునా?

పోతన భాగవతము వ్రాసిన గొప్ప భక్తాగ్రేసరుఁడు. అట్టివాడు రాజుంచుకొనిన భోగముదానిపై దండకముఁ జెప్పునా ? అను ఆంధ్ర వాల్మీకి ప్రశ్నకు "పోతరాజుయొక్క చరిత్ర చిన్ననాఁటి నుండియుఁ జివరవఱకును మన మెఱుంగుదుమా ? చిన్ననాఁ డెట్టివాఁడో ఏమి చేసెనో పెద్దనాఁడెట్టుమాఱెనో, లేదా ఎల్లప్పు డొక్కపోలికగ నుండెనో మన కేమియుఁ దెలియ''దనుచున్నారు. సరిపోయె. ఇక నెల్లప్పు డొకపోలికగనే యున్నాఁడను మాట నేల కాదనవలయును? పోతరాజు చరిత్ర చిన్ననాఁటి నుండియుఁ జివరవఱ కెవ్వరు నెఱుంగరుకదా! మఱి, పూర్వవయస్సున రసికులై, స్త్రీలంపటులై యద్వితీయ భక్తాగ్రేసరులగువారు పెక్కురు కలరని గోపీచందు, తులసీదాసుల నేలబట్టుకొనిరి ? పోతనగూడ నట్టి

వాఁడే కావలయు ననుటకేమి నియమము? కొందఱు భక్తులు మొదట దొంగలైన, భక్తులందఱును దొంగలే యనెడి సూత్రమెక్కడనేని చూపింపవు కదా? మొదటఁ దమ గ్రంథముల నరాంకితముఁజేసి తరువాత దేవాంకితము గావించినారనుట నేనును కాదనను. దీనికి శ్రీ లక్ష్మణరావుగారుదాహరించిన తిక్కనను హరిభట్టునే చూడుఁడు. తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమును మొదట మనుమసిద్ధికి అనగా నరాంకితముఁజేసి పిదప భారతమ్మును హరిహరున కంకితమ్మిచ్చినాఁడు. తెలియుదును. కాని పోతనవలె తిక్కన యెక్కడను తన నరస్తుతివైముఖ్యమును గూర్చి ఢంకా కొట్టలేదు. మఱి మాటకు భోగినీ దండకము వోలె నిర్వచనోత్తర రామాయణము తిక్కనది కాదను వాదమునులేదు. ఇట్టి తఱి తిక్కనను పోతన కుదాహృతు నేలసేయవలయును? ఇక హరిభట్టు విషయము?–ఇతఁడు మొదట వరాహపురాణము నరాంకితముఁ జేసి పిదప నా పాపము పోవుటకై మత్స్యపురాణము వ్రాసి దేవాంకితముఁ గావించినాఁడు. చూడుడు. ధనమునకై నరాధముల సన్నుతిఁ జేయఁ బొడమిన పాపముల్ సెడుటకొఱకు. కాని పోతనతో నీవయది కాదు. అతని ఇమ్మనుజేశ్వరాధములం దీభావము కానరాదు. ఆఁ. ఇంక పండితకీర్తనీయుఁడగు బమ్మెర పోతఅని ప్రథమపురుషముగఁ బద్యముండుటచే నది పోతన వ్రాయలేదను చరిత్రచతురానన స్వర్గీయ చిలుకూరి వీరభద్రరావుగారి యాక్షేపణమునకు ప్రాణము లేదను శ్రీ లక్ష్మణరావుగారి యభిప్రాయమున కేను నేకీభవింతును. దీని కితరకవుల కలములఁ గననేల? అట్లు వ్రాయఁడని చెప్పఁబడిన పోతనయే భాగవతమున తన్నుగూర్చి 'బమ్మెర పోతరా జొకఁడు' అని ప్రథమపురుషముగఁ జెప్పికొనినాఁడు. కవులు తమ్ముగూర్చి ఉత్తమ, ప్రథమ పురుషములయందుఁ జెప్పికొనుట యలవాటు. అయినను నేను భోగినీ దండకమును వ్రాసినది పోతన కాదు మఱెవ్వరో యనుచున్నాను. 'పోచమ అన్నమ'ల నామభేదముల కాదు. భోగినీ దండక

మందు బోచమ గాక అన్నమయే యుండుగాక! పోతనదిగాఁ జెప్పుటకు మాత్రము నా మనము వెనుకంజ వేయుచున్నదని మఱలఁ జెప్పుదును. దండకము భాగవతమునకు - ముందే యున్నదని యెవరును సిద్ధాంతీకరింప లేదుకదా! అట్టితటి యెవడో యొకఁడు పోతనశైలి ననుకరించి కావించి నాఁడని నాకేల సెప్పరాదు? అది సాధ్యమగునా? అని ప్రశ్నింతురేని యదియొక పెద్ద గ్రంథముకాదు. ఒక దండక మొకపద్యమే యందున్నవి. ఇకఁ బ్రయత్నించిన సాధ్యముకా దెందులకు? షష్ఠస్కంధమున సింగన పోతనవలె నెన్నిపద్యముల వ్రాయలేదు? పోతరాజు నిజముగా భోగినీ దండక మొకటి వ్రాసి యా నృపాలున కంకిత మొనర్చినవాఁడేయేని యిఁక నేమి? అంతటితోనైన సంతృప్తిపడి మిన్నకుండఁడా? అట్లు భాగవతము నవనిఁ బాలింపనేల? పోనిండు. సింగభూపతి నేమియుఁ దెలియనివానిఁగ కట్టి పెట్టుదమందుమా? అతఁ డలంకారశాస్త్రజ్ఞుఁడని రసార్ణవసుధాకరమే కదా వేనోళ్ళ పొగడుచున్నది. ఇట్టివాఁడంతటి యుత్కృష్టమగు గ్రంథరాజ మంతటి హీనస్థితికిఁ దెచ్చుట లరయ పోతన నరాంకిత మను మాటనే యెత్త లేదని స్పష్టముగ లేదా? లేకున్న నూహించుకొనవలయునే కాని సెప్పుట కలవి కాని కోపము పాప మా పోతనయెడ యాతని కెందులకు? ఇట్టి నీచ కార్యమున కాతఁ డొడిఁగట్టునా? అనుటకు లక్షణసారసంగ్రహ మం దలి కూచిమంచి తిమ్మనగారి 'ఘనుఁడు పోతనమంత్రి'అను పద్యమే ప్రత్యు త్తరమిచ్చుచున్నది. ఆ శిథిలమైనభాగముల నారయాదులు పూరించినారనుట కందలి శైలిభేదముల మనము ప్రత్యక్షముగఁ జూచుచునే యున్నారము. దీనికితోడు మఱొకటి. మునుపొకపరి పోతన యాతని కొక కృతి నంకిత మిచ్చునేని యిప్పు డీ భాగవతము నేల నివ్వఁడు? తన కన్నులయెదుట నంతటి తన గ్రంథముగతి యట్లు గాఁజూచి సహించెనేకాని యాతనికది యిచ్చుటకు సమ్మతింపఁడు. ఏమికారణము? ఇప్పుడు దీనింబట్టి యేనియును

పోతన తన కవితాకన్యను నరాధముల పాలుసేయువాఁడు కాఁడని నిర్ణయింపరాదా ! దీని కింకొక నిదర్శనము.

భాగవత ప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షకృ
ద్యాగ కథావిధానమున నల్పవచస్కుఁడ నైతి తన్నిమి
త్తాగమవక్త్రదోషపరిహారతకై యజనైకశైవశా
స్త్రాగమ వీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోడుతన్.

అను వీరభద్ర విజయములోని యీపద్యముఁజూచిన యప్రౌఢముఁ నున్న వీరభద్రవిజయము భాగవతమున కావల రచింపఁబడిన గ్రంథమ కాదనియు దాని నితరులు రచించినారనియు స్థూలదృష్టికిఁ దోఁచును కాని దూర మాలోచించినచోఁ బైపద్యము వీరభద్రవిజయ లిఖిత ప్రతులలోఁ గానరాదు. ఆంధ్రసాహిత్య పరిషత్తులోఁగల తాళపత్ర గ్రంథములలోని వీరభద్రవిజయప్రతులయందు, నాంధ్రపరిశోధక మహామండలిలోని లిఖి ప్రతులయందు నీపద్యము లేదని వినియున్నారము. "పోతరాజు వీరశైవమతము వదలి సర్వాద్వైత సమత్వము బోధించు నద్వైతములో నభినివేశము నార్జించి భాగవతము తెలిఁగించిన పిమ్మట నెవరో యీ పద్యమును ప్రక్షిప్తము గావించియుందురు". అని 'భాగవత ప్రబంధ'మను పద్యమును శ్రీ శేషాద్రిరమణకవులు పోతన వ్రాసినది కాదని యొప్పుకొనుట సూచించుచున్నారు కదా! ఇటులనే భోగ్నీదండకమును కూడ పోతనపోలె నితరులు కావించినారని యేల చెప్పరాదు? అతని శైలి పోకడలు కలవను వాని ప్రత్యుత్తరము ముందే యిచ్చినాను. ఐన, పోతనరాజు పేరుతో నితరు దీనిని రచింపవలసిన ప్రసక్తియేమి? అని యడిగెదరేని, యట్టి యాతని మును మంటఁగల్పఁజూచుటయే భోగినీ దండకము వ్రాయుప్రసక్తి అ నా చెప్పునది. కాక కొంతవఱకు పోతనయే యాతనికి కృతి నిచ్చినాఁ డ కొందము. దాని కేమి కారణము? ధనమున కాశించినవాఁడు కావ

యును. అంతియేకదా? అయిన నతఁడా భూపాలుని కొనియాడవలయునే కాని తిరస్కరించుట లెక్కడనేని పొసఁగునా? చూడుఁడు. "రాజుల్ బహువ్యాజులే భోజులే చంచలచ్చిత్తులే మత్తులే వేత్ర కాయత్తులే దోష సంసక్త సంపాదులే వీతమర్యాదులే వారిసేవింప భేదింపలే రంధ్రజీవింపఁ భోరామిఁ గావింపఁ గారాదులే" ఇది భోగినీ దండకములోనిది. ఈ తిరస్కార మతనికి సెందదని వాదించువారు రాజులలో సింగభూపతిని లెక్కకు రానివానిగాఁ జేయవలయును. కాని యది వలనుపడునా? ఏమి? పోతన స్వతంత్రశీలుఁడా? కాదని యెవరనిరి? ఐన తన స్వతంత్ర శీలత్వము నీ సందర్భమున నుపయోగించిన పని సాగిరాదని పసివానికిఁ గూడ తెలియునుకదా! 'ఇక పోతనయెడ యాచనకు పోయినవాఁడు యాగడముఁ జేయుఁడను లోకోక్తి నేల పాటింపరాదు! పాటింపనిచో నాతని నప్పు డజ్ఞానునిఁగానైనఁ జెప్పఁగలరా! 'శ్రీ శేషాద్రి రమణకవుల నడుగుచున్నాను. ఆఁ. ఏమనుచున్నారు? "దోషమూర్తులగు రాజుల నాశ్రయించి ఫలములేదని యాతఁడు భోగినీ దండక రచనమునకుఁ బూర్వమే గ్రహించియుండును కాని' చాలును. కానిపద మనవసరము.! దండక మారంభించుటకు ముందే యతఁ డది యెఱింగినట్లు చెప్పుచున్నప్పుడాతఁడు దానిని వ్రాయనేలేదని యొప్పించుటకు నాకు, నాకేమి? పోతనహృదయ మెఱింగిన ప్రతివానికిని చేతిలోని పని. ఏమని యడుగనేఁటికి?

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరముఁ బాసి కాలుచే
సమ్మెటవ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి సెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతమ్ము జగద్ధితంబుగన్.

అని భాగవతమ్మునందు పోతనయే రాజాధముల యెడ తనకుం గల విముఖత్వముంగూర్చి లోకమునకు కంఠ మెత్తుచున్నాఁడు. అట్టి భోగినీ

దండక మాహాత్మ్యమునకు తాము కట్టువడి యిట్టి మా పోతననే ధనాశా పిశాచమున కట్టై పట్టుబడినవానిఁగాఁ జెప్పుటలెట్టిదో పండితులే యూహింపఁ బాత్రిధ్రులు. ఈ పద్యమును పోతన భాగవతము నుగుఱించి వ్రాసెనేకా భోగినీ దండకమునకు కాదని వాదించుట లజ్ఞానులకుఁగాక విజ్ఞానులకు మెప్పుకోలు కాదని నేను వేఱ చెప్పవలయునా? ఇకఁ బోతరాజు రాజా శ్రియముఁ జేయనివాఁడేయగునేని యిట్టి పద్యము రచింపవలసిన ప్రస యుండఁజాల దను మాటయేమి? ఇది విపరీతము కాదెట్లు? ఏమి? శ్రీనాథుఁడు పోతనకు సమకాలికుఁడు కాఁడా? అతఁడు తనకృతుల నెన్ని యెందఱకిచ్చి యెంతసౌఖ్య మనుభవింపఁడు? అది పోతనకేల తెలియరాదు? ఆ పద్య మునువ్రాయు ప్రసక్తి యట్టివారల తిరస్కారమునకుఁ గూర్చి యుం రాదేల? దీనికేమి సెప్పుదురు?

పోతరాజు గర్భదరిద్రుఁడే యైనచో నాతని విషయము మనకం (కాదు మా కనుఁడు) ప్రశంసార్హము కాకపోయెడిదఁట. ఇది హాస్యా స్పద మగునుడియని సెప్పుటకు నేను సిగ్గుపడుచున్నాను. "ఐశ్వర్యజీవితము రోసి సహజ దరిద్రజీవితమే వాంఛించి మదమత్తులగు సమకాలిక రా న్యుల పంచలోఁ బడి దేవురింపక యున్నంతలోఁ దృప్తినంది భాగవతము వంటి యుత్కృష్ట గ్రంథము తెలుఁగుచేసిన పోతరాజు గౌరవార్హుఁడనుట నిర్వివాదాంశము" అను వాక్య మెవరిది? శ్రీ శేషాద్రి రమణ కవు లను వారిది కాదా? ఇందలి 'యైశ్వర్యజీవితము రోసి' పదముల కైశ్వర్య జీవితమున కిష్టపడక అని యర్థము. కాక భోగినీదండకరచనకాలమును దాటి వత్తురేని, మదమత్తులగు సమకాలిక రాజన్యుల పంచలోఁ బడి దేవురింప "యున్నంతలోఁ దృప్తినంది" అను పదములను నేను గట్టిగాఁ బట్టుకొందును, నాపట్టు నేలవదలించుకొనరాదు? ఇందే, పోతనవిషయమే, వీరే, సమ కాలికులగు రాజన్యులకు లోనయి స్వతంత్ర జీవనమున కంతరాయము

గలిగించుకొనుటకు ప్రతిఘటించిన జీవన్ముక్తుఁడని బల్ల గ్రుద్దుచున్నారు ఇక భోగినీదండకము పోతన దను వాదము నేతీరున నిలబెట్టుకొందురు?

ఒక వీరేకాదు. ఈ భాగము గ్రంథమందే 'భాగవత ప్రశంస' అను శీర్షికతో, క్రైస్తవ సర్వ కళాశాలా ప్రధానాంధ్ర పండితులగు శ్రీయుత రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు, బమ్మెరపోతరాజు సర్వజ్ఞసింగయ క్ష్మాపతి యాస్థాన పండితుఁడై యుండెనుటకు భోగినీ దండకము తార్కాణమైయున్న దని చెప్పుచు......ఇతఁడు (పోతన) పుట్టిన గోలె మహా దారిద్ర్యమనుభవించినవాఁడు. మహాకవులలోఁ బెక్కండ్రు దారిద్ర్య పీడితులయ్యు మహా ధనికుల నాశ్రయించి...నిశ్చయముగఁ దమ కాలంబుఁ గడపుకొనుచువచ్చిరి. అని పూర్వకవులు కొందఱ మచ్చునకు చూపించి ,మఱి, యాంధ్రభాగవత కర్తయగు పోతనామాత్యుఁ డంటిమా? యెంత పేదఱి కంబున మునింగినను ధనార్జనమునకై రాజులం బొగడనొల్లక కేవలము కర్ష కుండై తన కాలమంతయుఁ గడపెనని దీని కాతని ,ఇమ్మనుజేశ్వరాధ ముల' పద్యము నుదహరించినారు. భోగినీదండకము పోతనదేయని యొప్పు కొనిన మీఁదట నాతనిఁగూర్చి వ్రాయు యీ వ్రాలుకేమి ప్రసక్తియో కాని శాకేమియును పాలుపోవుట లేదు. ఇది యర్థములేనిదే యగునని నేను మనవి జేయుచున్నాను. దీనికి ప్రత్యుత్తరమేమి?

వీరికితోడు మఱొకరు. పోతనను వేంకటగిరి సంస్థానాధీశ్వరుం డగు సర్వజ్ఞసింగభూపతికి సమకాలికునిగా నిరూపింపఁబూని శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య బి.ఏ. గారు 1935వ సంవత్సరమున ప్రకటితమయి యానం దాశ్రమ గ్రంథరత్నమాలకు చెందిన భాగవతమున కుపోద్ఘాతము వ్రాయుచు భోగినీ దండకములోని 'పండిత కీర్తనీయుఁ'డను పద్యము నుదహరించిరి. ఇతఁడు(పోతన)పుట్టిననాఁటఁగోలె నాంధ్రకవులలో నెవరుననుభవింపని మహా దారిద్ర్య మనుభవించుచుండెనని చెప్పి నన్నయ రాజరాజనరేంద్రుని, తిక్కన మనుమసిద్ధిని, ఎఱ్ఱాప్రగడ యనవేమారెడ్డిని, భాస్కరుఁడు సాహిణి

  

మారనను, శ్రీనాథుఁడు రెడ్లను, అష్టదిగ్గజములు శ్రీ కృష్ణదేవరాయలను, మరియు తక్కుంగల యాంధ్రకవులందఱు నెవరే నొక్క భూపతి నాశ్రయించి ధనికులై రే మనిరి. కాని బమ్మెర పోతనామాత్యుఁడు మాత్రము నిప్పచ్చరంబున, దొప్పఁదోఁగుచుండినను నరపతులను వినుతింపనిచ్చగింపక కేవల కృషిమాత్ర జీవనోపాయుఁడై తనకాలమునంతయుఁ గడద్రోసెనని తన నరస్తుతివైముఖ్యమునుగూర్చి బమ్మెరపోతనయే భాగవత ప్రథమ స్కంధమున నిట్లని చెప్పికొని యున్నాఁడని ఇమ్మనుజేశ్వరాధములఁ జూపించుచున్నారు. సింగభూవరునకు పోతన భోగినీదండకముఁ గృతినిచ్చిన వాఁడేయని యాతనిగూర్చి వ్రాయు నీవ్రాతయును నిరర్థకమేయని నేను నిర్భయముగఁ జెప్పుచున్నాను. ఇది పరస్పరవిరుద్ధమైనది. దీనికి బి. ఏ. గారేమందురు?

ఇంకొకమాట? "బమ్మెర పోతనామాత్యుఁడు కడపమండలములోనున్న యేకశిలానగరమను నామాంతరముగల 'యొంటిమిట్ట' యందుండినవాఁడు" అని చెప్పుచు క్రిందిభాగమున, "ప్రతాపరుద్రదేవుని రాజ్యమునఁ బ్రధానపట్టణమగు నోరుగల్లునకును నేకశిలానగరమని నామాంతర మున్నట్లు ప్రతాపరుద్రీయము వలనను నతని శాసనముల వలనను దెలియవచ్చుచున్నది. కావున బమ్మెరపోతన యందుండినవాఁడా? యని యొక సందియము వొడమెడి. అది నిక్కమయేని నితఁ డొంటిమిట్టయం దుండెనను సర్వజనుల వ్యవహారమునకు హేతువుండదు. కావున నిట్లే యక్కడ వ్రాయఁబడినదని బి. ఏ. గారు చల్లగా జాఱుకొనినారు కాని యీయుపోద్ఘాతమునకు ముందేకదా! మా కాదరణీయులును పితృసమానులునగు స్వర్గీయ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారాంధ్రవాల్మీకితోఁ దాము తమ తల బ్రద్దలైపోవునట్లు వాదించి "ఏకశిలానగరమోరుగల్లే" అను శీర్షికతో పోతన బమ్మెరవాఁడేయని ఒంటిమిట్ట - ఒంటిమిట్టయేయని దాని కేకశిలానగరమను నామాంతర మెప్పుడును లేదని తమ విమర్శావళి ప్రథమ

సంపుటమున ప్రకటించినది? మఱి పోతనను కడపమండలిలోని యొంటిమిట్టయం దుండినవానిఁగా వ్రాసెడి యీ బి. ఏ. గా రప్పు డెక్కడ నున్నారు? ఏమిచేయుచున్నారు? పోనిండు. ఇప్పటికిని మించిపోయిన దేమియునులేదు. శ్రీ బి. ఏ. గారు తమ యభిప్రాయమునీందనే నిలఁబడుచు మొదట దానిని ఖండింపవలయును? లేదా? పునర్ముద్రణమం దైనను తమ శబ్దవ్రాతను తొలగింపవలసి వచ్చునని హెచ్చరించుచున్నాను. ఏమిలాభము! పోతన యేకశిలానగర నామాంతరముగల వరంగలు లేక యోరుగంటికి సమీపమందలి బమ్మెర గ్రామనివాసిగా నెన్నఁడో తేటపడినను, ఇంకను సందియము పొడమెడిని. పోతన యొంటిమిట్టయం దుండినను సర్వజనుల వ్యవహారమునకు హేతువుండదనుట వితండావాదమునకు దిగుటయగును. తాఁ బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనుట యగును.

పిల్లి కనుమూసి పాలను మెల్ల మెల్ల
గుటక లిడుకొంచు, నాదు గ్రాగుటలు జగతిఁ
దెలిసికొన నేర రెవరని తలఁచు నెడు
మాటకే యిద్ది పోల్ప సమానమగును.

ఇకఁ బ్రకృతమునకు వత్తును.

బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకం
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకన్న సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతర సీమలఁ గందమూల కౌ
ద్దాలికులైననేమి? నిజదారసుతోదర పోషణార్థమై.

అనునది పోతన తన పుత్రుండగు మల్లనంగూడి పొలముదున్నుచున్న సమయమున వచ్చి తనతోఁ బరిహాసమాడు శ్రీనాథునిఁగూర్చి చెప్పెనను కథ యొకటికలదు. ఈ పద్య మతనిదేయని యంగీకరించినవారికి తోడ్తో పోతన మనోనిశ్చయ మెంతటిదో యెఱుంగవచ్చుననుట కొంతయును

దూరముకాదు. అయిన రాజాశ్రియ మతని జీవితమునందలి పూర్వ భాగ మని భావింపవచ్చుననుట కర్థమెట్టిది? ఇది దురూహ్య మేలకాదు?

కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల ! యో మదంబ ! యో
హాటకగర్భురాణి! నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాతకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగనమ్మ భారతీ !

పదిమందితోఁ బాటు ముందటి పద్యమువలె దీనిని నేనుగూడ పోతనదే యనియొప్పుకొందును, ఇందు తప్పేమియును లేదు. కాని పోతనామాత్యుఁడు నరకృతులనిచ్చి రాజుల నాశ్రయించి యుంటచేతనే వశంవదరైన సరస్వతీదేవి చకితురాలై విలపించి నన్ను తొల్లిటివలెఁ బరులకు విక్రయింపవలదని కోరియుండినపుడే పోతరాజా భారతి కభయహస్తమొసంగి యీ పద్యము నిటులఁ జెప్పియున్నాఁడు. (దానిని వీరు విని యున్నారు.) అని ఇతఁడు నరకృతులె యొసంగినచో సరస్వతి కిట్లు తన మనశ్శుద్ధి తెలుపవలసిన యవసరముగాని సరస్వతి చకితురాలు కావలసిన యవసరము కాని యుండదని నుడువుచున్నారు. ఎంతటివింతగాథ! ఇంతవఱకొక భోగినీదండక మనుదానినే యొక సింగభూవరున కంకిత మిచ్చినట్లు తెలిపిరి. ఇపుడు (చూ-కృతుల నిచ్చి రాజుల నాశ్రయించి) పోతన కృతుల ననేకముల ననేకరాజుల కిచ్చినాఁడని చెప్పుచున్నారు. ఇంతకన్న శోచనీయాంశము మఱొకటి యుండునా? ,తొల్లిటివలె' అను పదము లా పద్యమందు లేవు. వీనిని క్రొత్తగ తమకు తామే కూటసృష్టిఁ గావించుకొనియూ, తాము చెప్పుచున్న దానికి పుష్టిని సేయుచున్నారు. కాని యదివారి బోటివారికి తగినదికాదు. పూర్వమొకపుడు, పోతన భాషాదేవి నట్లు కూటికొఱకు విక్రయించునేని, యాదేవి నూరార్చునపుడు 'నిను నాఁకటికిం దొలివోలె' అను పదములనేకాకున్న నింక వేనినయిన నా యర్థము వచ్చువానిని

తప్పక వైచిత్రియేయుండును. కాని యవి యీ పద్యమున మృగ్యములు, మఱి నరాంకిత మిచ్చినట్లు వాక్రుచ్చిరెట్లు ? అది యాతనికి రుచ్యమే గాకున్న యా సరస్వతి యేల చకితురాలు కావలయు నను దానికి మనవిసేయుచున్నాను. వినుఁడు. పోతనగుండె యీ విషయమున గట్టిదే యేల కారాదు? అయినను శ్రీనాథుఁడట్లు చెవినిల్లు గట్టుకొని, యేదే నొక కమ్మనికృతి నేరాజునకేని, కాదు తన కర్ణాట ప్రభువునకే యిచ్చి సుఖంబుండరాదా ? అని పోతనను బలాత్కరించినట్లు లోకమే కదా సెప్పుకొనుచున్నది? అట్టియెడ నీ శ్రీనాథునిబోధ కెక్కడ తలయొగ్గి నన్నారాజున కమ్మునోయను భీతి నాదేవి తన కంటఁ దడిఁబెట్టుకొనుట స్వాభావికము కాదా? అది చూచి పోతన యాతీరు ధైర్యోక్తుల నాతల్లికి మనశ్శాంతి నెలకొల్పుట ప్రాసఁగదేమి? ఏమి? భోగినీదండకము పోతన విరచితమేనా?

---

## బహిరంగలేఖ!

గృహలక్ష్మీ ॥

శ్రీ కవితా విశారద జి. జాషువకవిగారి 'స్వప్నకథ' కావ్యము పయి నుభయభాషాప్రవీణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు సేయు ఔచిత్య విచారమునకు సంబంధించిన నా పరామర్శపత్రమునకు '1938' సెప్టెంబరు నెలలో నీ చేసిన తీర్మానము నా సొంతసువలకును విలకించినాను. అది నన్నాశ్చర్యనిమగ్ననిఁ గావించినది. ఏమన, శ్రీచౌదరి గారి ప్రశ్నములకు నా యిచ్చు సమాధానముల నెవ్వరును కాదనలేదు. అట్లు చేయునంతవఱదనుక నిల్చునది కూడ నావాదమే; కాని నీ బూటకపు మాటలమాత్రము కొట్టువడి పోదు...సరిగదా! ఇంతకు దిగిన నీవైనను శ్రీచౌదరిగారి తరఫున న్యాయవాదినివై నా పరామర్శను తనఖీచేయ సాహ

సింపవు. ఇఁకనను తూలనాడు హక్కు నీ కెక్కడిది? నీ చేసినవానియందు నిది నీది మన్నింపఁదగని మొదటి పెద్ద తప్పు.........అయినను నేను ప్రభుత్వమునుండి తగిన చర్య తీసికొనలేదు. తీసికొనను కూడ! ఏమందు వేని:— 'చంపఁదగిన యట్టి శత్రువు తనచేతఁ జిక్కఁగాక కీడుచేయరాదు. పొసఁగ మేలుఁజేసి పొమ్మనుటే చాలు'నని వేమన యను నొక యోగిపుంగ వుఁడు చెప్పుచున్నాఁడు. కావున తనీప్పులను కొల్లలుగఁజూపించి నిను కొలఁది మందలించుటయే నీకు నేను మేలుఁజేయుటగా భావించెదను. కాని 'ఫక్తు' నీ బలె నాకలమునందలి సిరా ఖర్చుచేయను. అది పెద్దమనుష్యులకు తగదు. కాదు.......

రెండవది:—నా పరామర్శను చదివిన తదుపరి నిజమగు విమర్శకునిఁ గూర్చి చెప్పు నా వాక్యమును నీవు చౌదరిగారికేఁగా నున్నదని యంటివి. దీనితో నీ కా వాక్య మావంతయు నర్థముకాలేదని నేను నిస్సంశయముగా నమ్ముచున్నాను. ఎట్లనిన:—'ఏదేనొక కబ్బమును నిష్పాక్షికముతోఁ బరిశీ లించి, యందలి యుచితానుచితముల సహృదయత్వమున వెలిఁగొట్టువాఁడే నిజమగు విర్శకుఁడు' అని పరామర్శపాత్త్రమున నున్నది. ఈ వాక్యము విమ ర్శనమునకుఁ గడంగు ప్రతివ్యక్తికి చెందినదేకాని నీ వన్నట్లు కేవల మొక శ్రీ చౌదరిగారికి కాదని నా యభిప్రాయము. గృహలక్ష్మీ! మొదట నొకవేళ నీవుదానిని కన్నులు మూసికొని చదువుదు వేని యిఁకనేని మఱొకపరి విప్పిన నేత్రములఁ బఠింప నీకు నా హితము. ఇది నీ కనవసరమేని నీవుకాదుగదా! యీ విశాలాంధ్రోర్విని నొక్కండుకూడ నీదికు చేయెత్తలేఁడని నేను కంఠ మెత్తుచున్నాను. ఆనానిజమగు విమర్శకునికి వ్రాయు వాక్యమును 'బాగానే వుంది' అని శ్లాఘించు దివ్యౌషధమ్మున పాఠకుల కన్నులఁ గప్పి ముందట నీయాడుదురుక్తుల కన్నింటికి పునాఁడిగా పచ్చి జూటా కంజవేసినావు. కావున నీదిది రెండవతప్పు.

మూఁడవది:—...'అయితే పరామర్శకులు దాన్ని యీ పుస్తకంలో యెక్కడా పాటింపలేదు.

గృహలక్ష్మీ! "నిఱుపేద యగు ముసలివాని కటాక్షము లెవరికి కావలయు"నని పెడమొగము పెట్టు శ్రీచౌదరిగారికి, 'కటాక్షము లనఁగా చూపు'లని చెప్పుచు నొక పెద్ద కవిని విమర్శించి పేరు తెచ్చుకొనవలెనను తలంపున నౌచిత్యవిచారము పేరున నసూయా' విచారమునకు దిగిన మీకు నిజముగ వానితో (కటాక్షములతో) నవసరము లేదు. ఒప్పుకొందును, కాని యా ముదుకని దైన్యభావమునకు గుండెకరఁగి తన నిల్చియున్న నేలనే కన్నీటివరదల నోలలార్చు యా కారుణికాంతరంగ కేల వలదయ్యా!" అనునది గడ్డముఁ బట్టి బ్రతిమాలుచున్న ట్లున్నను నీ చెప్పుదానినే యొప్పికొందును. దీన నాకు పోవున దేమియును లేదు. కాని నా యడుగుచున్న దానికి మొదట ప్రత్యుత్తరమిమ్ము! నీ చలాకితనము నా చెంతకాదు సాఁగివచ్చునది. "విమర్శకుఁడు పవిత్రమైన తన యధికారమును నిష్పక్షపాత బుద్ధితో నిర్వహింపవలయు"నని శ్రీ చౌదరిగారు తమ యౌచిత్య విచారమందుఁ జెప్పలేదా? ఈ వాక్యమును నేను నాపరామర్శయం దుద హరించుటయేగాక ఒరులకు సెప్పుదుమే కాని యది మనచెంత నావంతయును లేదనుట కా పున్నమనాఁటి నిండు చంద్రుని యాకారమునుగూఁడఁ గనఁ బరచినాఁడను. కావున నేను దానిని చూడలేదని చెప్పి తప్పించుకొనుటకు నీకు వీలులేదు. నిజమేనా? ఇకఁ జెప్పుము. శ్రీ చౌదరిగారా ఔచిత్య విచారమందు విమర్శకు నిష్పక్షపాత బుద్ధికి పవిత్రమైన యాతని యధికారము నేతీరున చలాయించిరి? దానికి నీతూచిన తులములెన్ని? అది మొదలు తెలిపితివిఁగదా? పిదప నా పరామర్శయందు నా చెప్పినది నేను పాటింపకుండుటకు నీవు నీదు మొగము చిన్నబుచ్చుకొనునది, లేక చిట్లించుకొనవలసినది? ఏమి? నీవట్లు చేసితివా? లేదు సేయలేదు. కావున నిది నీది మూఁడవతప్పు. నీ నియమములనే నీ వెఱుంగవు.

నాల్గవది:— "సహృదయతలో విమర్శకుల (చౌదరిగారి) పొరపాటులను చూపలేదు".

సహృదయతతోఁ గాకున్నను కఠినహృదయముతోనైన విమర్శకుల పొరపాటులను చూపించినాననియే కదా? నీ చెప్పుచున్నది? గృహలక్ష్మీ! దీనికి నీ వొప్పుకొనకుము. ఇది యిదమిత్థమని నీ వాక్యము నీ నోటనే పలికించు బలము గలిగియున్నదిసుమీ!..............అంతే గాకున్న పరామర్శకులు కఠిన హృదయముతో నైన విమర్శకుల పొరపాటులను చూపింపనేలేదని ఖరాగా నేల చెప్పవు?..................... ఇఁక సహృదయతను పాటింపని కారణ మాలకింపుము............'ఆంధ్ర దేశమున కవితావిశారదునకుంగల (జాషువ కవికిఁ గల) గౌరవమునకు నే నోర్వలేననునదే యొక గొప్ప తప్పుగాఁ గొని మందపయినఁ బడుతోడేలి వలె శ్రీ చాదరిగారతనిపై దండెత్తినారు......'ఇది నీ వెట్లు నిరూపింపఁ గలవు' వనియా? నీ ప్రశ్న! అయిన చక్కఁగావినుము. "......ఈ కవితకు దేశములో కొంత యభిమానముకల్గినది......అని నేను కాదు శ్రీచాదరిగారే ఢంకాఁగొట్టుచున్నారు. ఇంకను నామాటపయిన నీకు గుమానుకలదేని యా శ్రీచాదరిగారినే యడిగి తెలిసికొనవచ్చుననికూడ సవినయముగనే మనవి సేయుచున్నాను. ఇఁక నీ ఔచిత్యవిచారమనునదాయభిమానము పోఁగొట్ట బయలుదేరలేదని నీ వెట్లు చెప్పఁగలవు? నీకు దారియేది? ఇట్టి యసూయా కులద్వేషితా విచారులు విమర్శక శబ్దమున కర్హులెట్లు?...వారిని విమర్శకులని నీ వెట్లంటివి?...వారల యాక్షేపణముల కిఁక లెక్కయేమి?...దీనికిఁ గూడ నొక బలవంతమగు నిదర్శనము చూడుము. 'గంగకు అమ్మ' అను పదము దురర్థద్యోతకమని ప్రత్యాదేశించిన మాట మఱచిపోయి కాఁబోలు "మా కృష్ణమ్మను కౌఁగిలించుకొనునే మన్నించునే తుంగభద్రాకూలంకష మీసరస్వతి" అని శ్రీ చాదరిగారు తమ రాష్ట్రగానమునందు వ్రాసికొనుచున్నారు... ఇపుడు దీనింజూచి యేనియు వారి యాక్షేపణములకుంగల ప్రాముఖ్యతను గుర్తింపవచ్చును గదా?... ఇట్లు 'Momus' అను దేవతకు లోనయి, ఔచిత్య విచారము లను పేరుల పురస్కరించుకొని యాంధ్ర వాఙ్మయము పుట్టిననాటఁగోలె నేఁటివఱకెట్టి విమర్శకుండు తన కలలో

నయినఁ దలంపరాని వెనవప్రశ్నములకు ప్రోఁకులాఁడి కవికులమ్మంత మన్ననఁ గలసినట్లు నిశ్చయముగా నొక చెంపఁ గొట్టుచున్న శ్రీ చాదరి గారికి నేఁడు నీకు మీ యిర్వురకు నా వేఱొక చెంప నెట్లు చూపింతును ? అట్టి శ్రీ చాదరిగారికిట్లు చేయూఁత నొసంగు నీకు మా భాషాదేవి యొడ్డోలగమున తక్కెక్కుడ ? ......గృహలక్ష్మీ ! ఇట్టి యనూయావృక్షములకు నీళ్ళుబోసి పెంచుచున్న నీవు నీ మతమువారు గాక ! వారియెడ సహృదయతను చూపి గౌరవింపుమనువా రాంధ్రావని మఱొక్కరుందురే ? ... ఒక యున్నతస్థానమం దుండి నల్వురకు సెప్పవలసినదానవు నీవే శ్రీచాదరి గారిని మఱపించి కవికోకిల (జాషువకవి) గౌరవమున కిట్లు కన్నులలో నిప్పులు వోసికొనుచున్నావు. కావున నీదిది నాల్గవ తప్పు—......

ఐదవది:—మొదలు ధైర్యలక్ష్మిని భాషావధూటిని నారాధింపుము — 'విమర్శనా పద్ధతులను మంటఁగలపి, విద్యావంతుల్లో వుండవలసిన సంస్కా-రానికి నీళ్ళువదలి, విమర్శకుని వ్యక్తిగతంగా సాధ్యమైనంతవఱకు తన (?) పరామర్శను జబర్దస్తీగా చేస్తూవచ్చారు (?)' ......గృహలక్ష్మీ! శ్రీ జి. జాషువ కవిగారి స్వప్నకథ, శ్రీచాదరిగారి ఔచిత్యవిచారము—భాషాదేవి ప్రతినిధి పరామర్శ—నీ యహంభావము— సహృదయాంధ్రలోకమునకుఁ దెలియకపోదు. అకటా! శ్రీచాదరిగారే నీవని నాకు తెలియక నేను నాపరామర్శను నీగుజారతుచేసితిని. మోసపోతిని. ఎదుటఁబడి వాదించిన యపజయము నిశ్చయ మనుకొంటివి. నాకు నేనై వచ్చి నీ వలలోఁ జిక్కుకొంటిని. నీ కసి తీర నన్నన్యాయముగా హింసించుచున్నావు. కానిమ్ము ! ఈ నీ పాపము పండకపోదు. తన సామ్రాజ్యమందలి యధర్మద్రుమముల మూలములతో నున్మూలింపుమని కదా ! నాకు భాషాదేవి నిర్దేశము ? నా ధర్మమును నేను నిర్వహించెదను. నీ యడావుడి నన్నటకాయింపలేదు. నీ తాతల, పుంభావసరస్వతుల ముక్కుఁబట్టి మున్నూఱుచెఱువుల నీళ్ళ ద్రావించిన చెళ్ళపిళ్ళ కవిపంచాననుని శిష్యుఁడను నేను. నీబోటి విప్ర

లంభకులకు నా కలము ప్రక్కలోని బల్లెము. అంతే కాదు. నీవు కేవలము ప్రల్లదుకాలవుగా ముప్పదిమూఁడుకోట్ల తలలయెదుట మిన్నదిర్చిపో యిదే నిన్నుకాదు, నీ తీర్మానమును నా వామపాదమ్మునఁ దన్నుచున్నాను. సామర్థ్యమున్న కచ్చ బంధింపుము. నీ యన్యాయ ఖడ్గమునకు మించినశక్తి నా దేవి నా సహజసమర్థ న్యాయఖరాసికి ప్రసాదింపకపోదు. "The words unity, action, sentiment, and diction, pronounced with an air of authority, give them a figure among unlearned readers, who are apt to believe they are very deep, because they are unintelligible" అని Eddison, నీబోటి Cavillers ల తత్వము ప్రాకృతులముందఁ దప్ప ప్రాజ్ఞులచెంతఁ బనికి వచ్చునని వ్రాయఁడు. శ్రీచాదరిగారి ప్రశ్నములకు యథోచిత సమాధానములనొసంగి నేను వారిని కిక్కురుమనకుండఁ గూర్చుండఁబెట్టినాను. అంతే కాదు. నా కల మాంధ్రవాఙ్మయమునందుండునంత కాల మా యనూయా విచారములజోలికి మఱిపోరనికూడ నానమ్మకము. ఓ గ్రుడ్డి గృహలక్ష్మి! "ఎన్నఁడో మఱచిపోయిన యీ వాదమును మఱల త్రవ్వి పైకిఁ దీయుటకు నా కుత్సాహములేదు." అని నాపరామర్శఁ జూచిన వెనుక శ్రీ చాదరి కల మొకరికి ఖుద్దున ఖత్తు వ్రాయుచున్నది. అవసరమగు నేని యా వాక్యము నాదే యని నేను వారి నోటనే రుజువు చేయింతును. ఏమి ఫాయిదా? నీ వనుకొనినట్లు వారి ఔచిత్యవిచార మనూయావిచారము గాక నాకలము కదము దొ్రక్కచో నంతటి శ్రీ చాదరిగారా? యిఁటి ఖులాసాగా నుండునది? గుజస్తావాదమును ఖననము సేసి పైకిఁ దీసినది నా కలమేకదా? మఱి వారి వాక్యమున కర్థమెట్టిది? గృహలక్ష్మి! ఏమి! 'ప్రాయము చాలదు. భాషాజ్ఞానమంతకు లేదని పరామర్శ పాత్రమున భాషాభిమానులకు తెలిపెడి పదములవలనఁ గలిగిన సాహసమా యిది? లేక నిక్కముగ నంత బలముఁ గలిగి యిట్లు నిప్పులఁ బోయుచుంటివా? లేదు నీకింత బలములేదు. కేవలము నే నొక పత్రిక నను కొను గర్వము తప్ప

యింక నీ చెంతనేమియును లేదు. శ్రీ చాదరిగారిని పోనిమ్ము! వెఱ్ఱితల్లీ! తనుతిరిగిచూచుకొనుము. మొదట నింటను గెలుపొంది పిదప రచ్చ గెలువుము. చెప్పుము. 'శ్రీ చాదరిగారి దసూయావిచారమే కాని యది ఔచిత్య విచారమే కాదని నేను నా కంఠము బొంగురు పోవ మొత్తుకొంటినే! దానికి నీ వేమని సెప్పితివి? నా పరామర్శ ముఖ్యోద్దేశమేమి? కథా వస్తువును కాలఁదన్నితివెట్లు? ఈ కారమునూరు పనియేమి? చెప్పవేమి? విమర్శనా పద్ధతులను మంటఁగల్పిన దెవరు? నీవు కాదా! గృహలక్ష్మి కాదా? నా పరామర్శ నిన్ను చూడవచ్చిన దెందులకు? నీ వొక పెద్ద మనిషివని భావించి కాదా? న్యాయమును చెప్పెదవని కాదా? శ్రీ చాదరిగారు తప్పులుగఁ జూపించిన వెంతవఱకు నిజమో యది యొఱింగిం చుట నీ కర్తవ్యము కాదా? కాదనుము, బలవంతములేదు. అనకున్న మఱి, యాప్రశంస నేల యెత్తవు? ఇఁక పక్షపాత రోగము నీది కాదా? పత్రికకు సర్వ సమత్వ మనునదే ముఖ్యాంగమని నేను సెప్పుచున్నాను. ఒప్పుకొందువు కదా! అట్టియెడ వాది ప్రతివాదులతగాదా సరిగా అజ్మా యషీ చేసిగదా! నీవు నీతీర్పుఁ జెప్పవలసినది? ఏదీ? వాదినిగూర్చి ఒకమాట యును సెప్పనైతివే! శ్రీ చాదరిగారి దావంతయుఁ దప్పులేదా? అన్నియు నొప్పులేనా? అట్లొప్పింపు గుండె నీకున్న యదా? ఇంతకు వచ్చి యిపుడవనత వదన వయ్యెదవా? నలువురునవ్వరా? వృద్ధకు విలాసిని పదము వ్యర్థమేనా? 'వృద్ధ వారవిలాసినీ విసరమునకు' అనిన ముక్కుతిమ్మనార్యుఁడు మూఢుఁ డేనా? పారిజాతాపహరణ మపారలక్షణాపహరణమేనా? ముద్దాఁడి తేట కొని చూచుట బాగులేదా? "ఫాలతలము ముద్దుఁగొని తేఱకొని నాతిమొగ ముచూచి' అను మాకవిపంచాననుని శిష్యులు కాకులేనా? సౌందరనందము చిందరవందర యేనా? నీ కొంగు నిండ వరము లిచ్చెదననుటగూడదా? 'మూఁటగట్టుకొని వచ్చిన రహస్యములను విప్పిరి' అను చిలకమర్తి చిన్నవాఁ డేనా? అహల్యాబాయి కైవల్య మందెనా? 'ముక్తిని మూఁట గట్టుకొని'

అను జొన్నలగడ్డకు మూరెడు గడ్డమున్నదా? సాహిత్య తత్వ విమర్శనము రాహిత్యమైనదా! యౌవనము మొలవదా ? 'మొలచిన కౌతుకంబు' అనిన తిక్కనార్యుఁ డొక తుక్కుకవుల లెక్క కెక్కవలసినవాఁడేనా? నిర్వచనోత్తర రామాయణము నిజముగ నుత్తర రామాయణ మయ్యెనా? ఇట్టి వెన్నని జూపింతును! నే నాంధ్రిహృదయుఁడను. ఇది లేఖ. ఇపుడు నీకోసమై తాలింపుతో అలాహిదా తయారై ద్వితీయ ముద్రిణమునకు వేచి యున్న పరామర్శను దర్శింపవలెనుగాక ! ఏమి ! కవితా విశారదుని రచన నగమ్య గోచర మనుట కవికులమునకుఁ గాకున్న మా సె కవికోకిల కైన ధిక్కారముకాదా ? ఈ కవి యెంత సుకుమారుఁ డనుట నీ వలె పెద్ద మొద్దనుకొనుట కాదా ? కవిగారికి కాఫీ త్రాగవలెననిపించు ననుట వ్యక్తిగతము కాదా ? తొమ్మిది గంటలకు నిద్రిలేచి యుందురనుట దుర్మార్గుల పద్ధతి కాదా ! అతని కావ్యములు వాఙ్మయములో ఖాయము నందఁజాలవనుట నీవలె యల్కాగాఁ జేయుట కాదా ? కాదను నీవు పడ్లగింజలోని బియ్యపుగింజవు కావా ? కా ననుట నీ బడాయిఁ గొట్టు కొనుట కాదా ? కాకపోయిన శ్రీ చౌదరిగారిది యనూయావిచారము కాదని మెప్పించితివా ? నీవు విద్యావంతురాలవు కావా ? కానని యొప్పు కొంటివా ? నేను నీ జుల్మానా మాపుజేసి నిన్ను విడచిపుచ్చనా ? అంత కఠినాత్ముఁడనా ? షే రూరులేనివాఁడనా? నీతిని నూతఁ గల్పుదానవు నీవు కాదా? నీకు చెప్పువారెవరునులేరా ? న్యాయము నన్యాయముగఁ జేయుట యేనా! నీబటాబూరము? అదియేనా నీయందున్న సంస్కారణము ? గాబరా పడెదవేమి? ఇట్లు 'ఉల్టాచోర్ కొత్వాల్‌కు డాంటా' అను సామెతను సార్థకముగాఁ జేయుచున్న నిన్ను వెన్నాడి "గృహలక్ష్మి! ఎందుపోయె దవు? నిలువుము. ఈనీవిపరీత దురభిప్రాయమేమి? అది మెప్పించి మఱికదలు" మని నిన్ను నిర్బంధించెడి గరజు నాకుఁగాక! నీకేమి పట్టినదమ్మా? ఎక్కడనేని తనచోరీ తానే యొప్పుకొనునా? జబర్దస్తియట జబర్దస్తి!

ఓ గోలా! ఒక జబర్దస్తీయే కాదు. 'బల్కె యరాకనె యదాలతులాల్యాకే సామ్నేహీ నాక్ పకడ్ కర్ దో తమంచే దేతేహుఁయే పూఛ్ సక్తాహుఁ. అగర్ చాహితీహో తో పూఛ్ తాహుఁ'. తెలియునా? ఇట్లొక సత్కవి ధ్యేయుని గౌరవమునకు సహింపక 'ఔచిత్య విచారము'లను పేరులతో నసూయావిచారముల వెళ్ళఁబోయువారినేగాక నిన్ను గృహలక్ష్మిని, సన్మార్గమునకు రా చక్కగా సంస్కరించెడి కలమును భాషాదేవి కయిష్టముగా తూలనాడుట యనునది నీది యైదవతప్పు. ఇది నీ సామంతులకేగాక, సద్విమర్శకులకేగాక ధర్మమునకు తలవంచి యేమో .పోనిమ్మనుకొని నిన్ను పోషించుచున్న నా సోదరీమణులకును పసందుకాని సేత. అడిగిచూడుము...

ఆఱవది:—"క్రొత్తగా యీ పుస్తకమును చూచినవారికి యిందులోని విషయాలు తల తోక లేకుండా కనిపిస్తాయి" ఇటు చూడుము. గృహలక్ష్మి! మనలో మాట కడుగుచున్నాను. నీవు నన్నేమనుకొంటివి? నీకున్న తెలివి నాకు లేదనియా?......అరరే! పరామర్శ నిజముగా తల తోక లేకనే యుండునెడ, దానింజూచు ప్రతివానికి నటులనే కన్పడవలయును కాని, ప్రాతగా చూచిన వారి కగుపడి క్రొత్తగా జూచిన వారల కేల యగుపడదమ్మా? ఇఁక నీ నోటనే చెప్పుము! తల తోక లేక యుండునది నీయిచ్చిన యభిప్రాయమా? లేక నా పరామర్శయా? ఎక్కడ నేనియింత తెలివి తఫావతుతన ముండునే? ఏమి? పరామర్శ! క్రొత్త వారలను చూచియాపాదమస్తకము బిబ్బీలవిధాన బురఖా వేసికొనదుకదా? ఓహో! మఱచిపోయితిని; విషయమిది కాదు. చదువుకొనినవారలకుఁగాక! తల తోక నీ కెట్లు కన్పించును? ఏమి? 'నేను చదువుకొనిన దానను కానా'? అని యడిగెదవా? గృహలక్ష్మి! నీవునాచదువును లెక్కబెట్టెదవుగాక! అంతేకాదు. రేపటినుండి నీ పేరునకు 'చదువుల' అను విశేషణముఁ జేర్చుకొందువు గాక! నీ;వేమియును తెలియనిదానవనియే నాచెప్పునది. ఏ మందు వేటికమ్మా? 'చదువది యెంతగల్గిన రసజ్ఞత యించుక లేక యున్న, యాచదువు నిరర్థ

కమ్మ' అంటిరేమేనా? 'గుణసంయుతు లెవ్వరు మెచ్చరెచ్చటన్' అను నుడిని
జూషువ కవిత తేనెబిందువులలోని కమ్మందనము తమకు చేదుగా నాకని
కవిత నగమ్యాగోచరమను శ్రీ చౌదరిగారు—కాదు—గృహలక్ష్మి యను
నీవు చదువుకొనిన దానవే యేల కారాదు? నిన్ను న్యాయమార్గ
మరయు కవికుల మెప్పుడును గౌరవింపదు. దీనికి సహాయ మొక నిదర్శ
నము కూడా......చూడుము, '1 నీ యుత్సాహమె......2 నీ యాన్న
త్యమె......3నీ ప్రోత్సాహమె...4కేయక్ కేసరి....'అను మగణపద్య
మందలి మూఁడవ పాదమునకు చెందిన పెద్ద తప్పు నేను నీ యందుఁ
జూపింతునుగాక! నీ వాజాషువ కవివర్యుని కవిత్వము నా జన్మాంతర
మొడియఁగట్టిన నిట్టి దొకటిరైయెనను నీకుఁ బట్టువడునా? దీనితో నీ చదువు
కొనిన చదువు బట్టబయ లగుటలేదా? ఇట్టి నీ వాతని నంత గరీబనుకొని
యీ తరహా యెట్లు పరాభవింపఁ జూచితివి? ఇఁక నీకు నా పరామర్శ
తల తోక లేకుండ కన్పట్టు చున్నదనుటయం దాశ్చర్య మందవలయునా!
గృహలక్ష్మి! నాకు కూర్చువా రనుకొని శ్రీ చౌదరిగారి మోమోట
మునఁ జెప్పిన నీ టాటోటుమాటల పంట నీ కెంతటి తమాషాగా కుడువ
వలసి వచ్చుచున్నదో యిపుడైనం దెలిసికొంటివా? కవిగారి పద్యములందలి
యే యే భాగములకు శ్రీ చౌదరిగా రేయే ప్రశ్నముల వెలయించిరో యా
యా భాగములతో నా యా ప్రశ్నముల నుదహరించి వానికిం దగిన
ప్రత్యుత్తరము లిచ్చుటయే నాకుంగల పని. సోదరవర్గము చూడవలసినవియు
నవియ. కాని యింతకు వచ్చిన యీ సమయమున నకే నేను కథనుచెప్పు
నది? వారు విని మురిసిపోవునది? అట్టివా రున్నను స్వప్నకథ నేల చేఁ
బట్టుకొనరఁటమ్మా? ఏమి? స్వప్నకథ నిజముగ స్వప్నకథ కాదుగదా?ఇట్లు
తల తోక లేకుండ కనిపించునను వాక్యమ్మున లోకమ్మును వంచించు
టయే గాక పరామర్శ రెండున్నర యణాల ఖరీదును తప్పనిసరిగ మఱచి
పోవుచున్నావు. ఇది కారణమ్మున నిది సిది యాఱవతప్పు.

ఏడవది: "—.....పైఁగా యీ విమర్శ యేసహృదయుణ్ణీ యాకర్షింపదు."

"......ఇది నీవు తలచు మించిన యభిప్రాయము. శ్రీ చౌదరి గారు నాకు ఇట్టివారు కావున వారిని ధిక్కరించిన యీ పరామర్శ నన్నా కర్షింపలేదని నీ మాట నీ వేదువుము. సంతోషింతును. అంతే కాని సహృదయశబ్ద మన్వర్థమైనవారల నెల్ల బలవంతముగ నిన్ను నీవు కలుపుకొని నీవైనదిగాక వారలం గూడ నీతో హాస్యాస్పదులఁ గమ్మనుచుంటివా? ఏమి నీ సాహసము! నీ యన్యాయాభిప్రాయము మాకంగీకారమే యని నీవనెడి యాంధ్రావనిం గల సహృదయుల నందఱఁ బోనిమ్ము. ఏదీ? శ్రీపాద కవి రాజేంద్రుఁడు-చెళ్లపిళ్ల కవిపంచాననుఁడు- విశ్వనాథ శబ్దశాసనుఁడు- తల్లావఝ్ఝల నవ్యసాహిత్యాచార్యుఁడు, రాయప్రోలు కవిభూషణుఁడు, కురుంగంటి కోవిదుఁడు- చాలును. వీరలు సహృదయులే గాక భాషావధూటి యొడ్డోలగమునందలి ప్రముఖులలోనివారలని నేను చెప్పుచున్నాను. నీవు నొప్పుకొందువుకదా? అయిన చేతుల నెత్తింప వెందులకు? మఱి, 'యే సహృదయుణ్ణీ' అనుదానికి జవాబుదారెవరు? ఇట్లు 'కామలారోగి పచ్చగాఁ గాంచు జగతి' అను నుడిని సార్థకము చేయుచున్నావు. కావున నిది నీది యేడవ తప్పు..........

ఇఁక నెనిమిదవది:—దీనిని నాకలము వ్రాయ నొల్లదు.

ఏకశిలానగరమందు 'చాచా' పేరున తెరలఁ హార్మోనియమేమియు లేకుండ కట్టుబట్టల నొక్కండ 'వాల్మీకి' 'దుర్యోధన' 'దుష్టబుద్ధి' 'సారంగుల' పదిరెండురంగములఁ బ్రదర్శించు 16—3—39 నాటిరాత్రి జనమంతగా రాకునికి తలయూచి 'ఏమి? నిజాంరాష్ట్రమందు నటకులు లేరా! లేరా? లేరా!' అని దిక్కులు మార్మ్రోయ ముమ్మాఱు గర్జించి, "ఓ శ్రీకృష్ణా! నేఁడు నీవు నన్ను వెన్నంటియుండుము. నీ రామకృష్ణుని తేజము తెల్లము గావింతును. ఓ నాట్యకళా మతల్లీ! నిన్ను ముక్కు మూతి లేని

దానిఁగాఁ జేయుచున్న నటకవర్గమునకు పాఠముఁజెప్పు పూనికయే యిది, కావున నేఁడు నీవు నాలో లీనమైయుండుము” అని యా దేవి నిజమగు సౌందర్యమును వెలిఁగొట్టు నన్నుచూచి ముక్కుపై వ్రేలిడుకొని 'యద్దిరా' యనుచున్న కొద్ది విజ్ఞానుల కదిలేదిదిలేదని యేమియు నెఱుంగని నాల్గవతర గతి కొంత కోపము తెప్పించినను, యీనాఁటి యింతటి యపూర్వనటకుని చూచిన నాకన్నులతోనిఁక కావలయుపరికరముల సహాయమునసేనియు నిందు నెందునుంగానివారల దర్శింపఁజాలనని చెప్పుటకో యన యుజడంబులగు స్తంభమ్ములఁగంపింపంజేసి నాదేవునిమాహాత్మ్యమున తెల్లవాటి శ్రీయుత కొమురవెల్లి కాశయ్యగారి హాలునుభూమట్టముగావిఁచెడి యొక పెద్ద బలము గలిగిననటకుఁడనయ్యు నీతుది వాక్యమున కుబికివచ్చు నాయావేశము నెట్లణఁగఁ ద్రొక్కి నానోచూచితివా? గృహలక్ష్మీ! కరుణకు నాగుండె పురిటిగీము కావున నింతటితోనే నీవుతప్పక చింతింతువనుకొనియెదను. కాక– (ఇప్పుడెందులకు?) నీకన్న వేయిమడుంగులంతటి శ్రీ చాదరిగారే నాకు పూజనీయులుగాఁ దోఁచుచున్నారు. చూడుము, నన్ను 'మిత్రమా!' అని సంబోధించి “నిష్కళంకమైన మీ హృదయమును, సత్యపరివణమైన మీబుద్ధియు నన్ను లోఁబరచుకొన్నవి......... వెనుక పోతనామాత్యుని నివాస చర్చలు సాఁగినప్పుడు వారివంశమువారు ప్రస్తుతము 'నెల్లుట్ల' అను గృహ నామముతో నున్నారని యొకరు వ్రాసిరి. దానంజేసి మీరు పరమ పూజ్యమైన తత్సంతతివారై యుందురని నాయంతరాత్మ ప్రబోధించు చున్నది. కావుననే మొదటి పరామర్శ చూచిన నాఁటినుండియు మీయెడ నా కాదరమే కలదు. ......మన నెయ్యము నిష్కళంకము నిర్వ్యాజము నిరంతరము నగుఁగాక ......” అని యింకను వ్రాయుఁడు, దీనికి నేను నొడంబడినాఁడను. అయినను నీవు వారి త ప్పావంతయు లే న ట్లొక నా మీఁదికే తయారగుట నీకును పాఠముఁ జెప్పఁబూని మిత్రులయిన శ్రీ చాదరిగారికి మాట యిచ్చియును వారి ఔచిత్యవిచారమును తప్పుగా నీకు మఱల

నిరూపించుటయందు నక్కడక్కడ వారి మనము తప్పక నొచ్చియుండ వచ్చును—వచ్చునేమి? నొచ్చునని నాకు తెలియును. ఇందుకు నేను 'నన్ను మీరు మన్నింపుఁ' డని యిదే నా మనఃపూర్వకముగా వారిని క్షమాపణ మడుగుచున్నాను. కౌఁగిలించుకొను చున్నాను. అంతే కాదు......
'ఔచిత్య దూరమ్ములౌ, వాదమ్ముల్ పచరించి పున్నిడిన మా వాగ్దానముల్ నమ్మఁగా, రాదంచున్ నిరసించి......, నా దౌచిత్తము నివ్విధిఁ గలఁతురే! న్యాయమ్ము వర్జింతురే' అను రాష్ట్రిగానమునందలి పద్యము నాకు కన్నీరుఁ గార్పించుచున్నది. నా హృదయమును భేదించుచున్నది. గృహలక్ష్మీ! ఇట్లు నామిత్రులగు శ్రీ చౌదరిగారు పోతన మధ్యవర్తిగాఁ దమ తప్పు నొప్పుకొననట్లు నటించి యొప్పుకొను చున్నను పత్రిక పదమున కంతతాకత్తు కల దనుకొని లేని పెత్తనముఁ బూని వీఁ డెంతవాఁడను నహంభావమ్మున నను నీవు నిందింతువుగాక! అంతమాత్రమున నా కలము కళంకమగునా? సహృదయాంధ్రలోకము నన్నాదరించుటయందు విముఖత్వముఁ జూపునా? ధర్మమును జయించునది యధర్మమా? పెద్దకవులు ముద్దు సేయుట మాను దురా? తన యొడ్డోలగమున నాయట్టివాఁ డొకడుంట భాషాదేవి మోద బాష్పముల విడువదా? నాకు నేనే యేమని సెప్పుకొందును? ఆత్మస్తుతి యగును గాక! సెలవు.

భవచ్ఛ్రేయోభిలాషి,

నెల్లుట్ల రామకృష్ణకవి.

---

# ఆంధ్రవాఙ్మయము – ప్రకృతి

మనోహరములగు ప్రకృతివర్ణనలు ప్రతి సారస్వతమునందును కలవు. స్వాభావికములగు ప్రకృతివర్ణనములకును కవిత్వమునకుం గల సంబంధ మతిసన్నిహితము. కవి ప్రకృతినియత్యంతముగఁ బ్రేమించును. ఆ ప్రేమ యపారము, అగాధము, పవిత్రమును. ప్రకృతి దృశ్యములు కవి భావములను ప్రజ్వలింపజేయును. తదవలోకన జనితానంద మాతనిని ప్రకృతిని వర్ణింప దొరకొనఁజేయును. తత్ప్రయత్న ఫలితమే విదగ్ధ హృదయుల యెడ కవిత్వముగాఁ బరిణమించును.

ఈ ప్రకృతిప్రేమ ప్రకటన సాధ్యమైనప్పుడు, అవసరమైనప్పు డతఁడు చేయును. నాటక మెక్కువగ మనస్తత్వపరిశీలనా సంబంధము. ప్రకృతివర్ణనల కందు స్థానమెక్కువగా నుండదు. అట్టి నాటకమందు సయితము ఔచిత్యానుకూలములగు ప్రకృతి వర్ణనలు కన్పించుచుండు. దీన, కవి ప్రకృతిప్రేమ విస్పష్టము. ప్రపంచ సాహిత్యమందు నాటక రచయితగా సుప్రసిద్ధుఁడయిన కాళిదాసమహాకవి శృంగారశాకుంతలమందు -

"హాయిగా స్నానములఁ జేయ ననువుపడుచు
పాటలసుగంధయుతవన పవన మమర
సులభముగ నీడలను నిద్రసుఖముఁ గలిగి
దివసములు రమ్యము లగు చాల చివరలందు.
కమ్రసుకుమార కేసరాగ్రములు గలిగి
తుమ్మెదలచేత దరచుంబితమ్ములగు శి
రీష కుసుమముల దయార్ద్రహృదయలగుచు
తాల్తురింతులు కర్ణావతంసములుగ".

అని వనవర్ణనను మిక్కిలిహృదయంగమముగఁ జేసినాఁడు. భవభూతి మహాకవి ఉత్తరరామ చరిత్రమున—

"నేలబొరియలలోఁ దాఁగ నీరులేక
నెండ వేడికి దూపిలి తొండలిందుఁ
గొండచిలువల చెమ్మటల్ గ్రోలుచుండు
భయదములు నిర్జలంబు లీ ప్రాంతరములు"

అని యరణ్యవర్ణనముఁ జేసినాఁడు. కాళిదాసుని ప్రకృతివర్ణనలు కోమలములు. భవభూతివర్ణనలు గభీరములు. Shakespeare మహాకవి రచనలయందుఁగూడ ప్రకృతివర్ణనలకు తావుకలదు.

స్వభావసిద్ధమగు ప్రకృతి వర్ణన నిక్కంపు కవిత్వ లక్షణములలో నొకటి. కాని యుత్ప్రేక్షా కావ్యలింగాద్యలంకారములతోఁ బ్రకృతివర్ణన యను నెపమున భావనాతీతములుగ వ్రాసినమాత్రమున కవిత్వము కాఁజాలదు. వర్ణనలు సహజములుగానుండిననేహృదయాహ్లాదకరములు. చూడుఁడు, "Fidelity to nature, not perversion of it, in the name of a figure of speech is one of the main essentials of poetry." ప్రకృతి కనుకూలమగు కవిత రసికజనానందకరము. "Poetry is enjoyed in so far as it is unnatural and entirely out of touch with human mentality. No poetry can live that is divorced from nature."

ఇప్పుడు మన మాంధ్రవాఙ్మయమునందలి ప్రకృతి వర్ణనలను గుఱించి విచారింతము. మనకు తొలికబ్బము భారతము. కావున కవిత్రయ కవిత్వంబునందలి ప్రకృతి వర్ణనము ప్రథమ విచారణీయాంశము. నన్నయ భట్టు ప్రకృతి వర్ణన యత్యంత మనోహరము. సుకుమారములగు గుంఫనము లీతని ప్రకృతి వర్ణనల రమణీయతరములుగఁ జేసెడి. అంతేకాదు. ఈ నన్న పాచార్యుని వర్ణనలు విస్పష్టంబు ననన్యంబునగు నొక చిత్రమును చిత్రింపఁ

  

జేయఁ గలుగునవిగాఁ నుండును. ఇందున కుదాహరణములు తత్కృత భారతభాగమునం దనేకములు. వనవాసకాలమ్మున పాండవులు గంధమాదనంబునకుఁ బోవునప్పుడు శైలవర్ణనమ్ముఁ గాంచుఁడు.

"నానావర్ణశిలావిహ
గానేకమృగాభిరామమై భూనారీ
నానాభరణవిభూషిత
పీనోన్నతకుచముఁ బోలి వెలిఁగెడుదానిన్."

"లలితాచ్ఛస్ఫటికశిలా
తలములపైఁ బాఱు విమలతరనిర్ఝరిణీ
జలపూరము లను తారో
ల్లలదురుహారాలి నుజ్జ్వలంబగుదానిన్."

వారటఁ బ్రవేశించిన యనంతరము గాడ్పుతోడి వాన పెద్దయుం బ్రొద్దు కురిసెనఁట. అది యెట్టిదో పరికింపుఁడు.

"కురిసెఁబ్రచండవృష్టి ఘనఘోషము లెల్లకెలంకులన్ భయంకరములుగాఁ గరాళకరకాతతులొప్పఁ దటిల్లతాళి విస్ఫురితముగాఁ బ్రపూర్ణజలపూరము తద్గిరికుంజ భూరినిర్ఝరతటినీతటీనికట సాలచయమ్ము విమూలితమ్ముగాన్"

నరనారాయణాశ్రమమ్మున బదరీవర్ణనముఁ దిలకింపుఁడు.

"లలితమధుస్రవఫలములు
విలసితమృదుపత్రతతులు వృత్తస్కంధ
మ్ములు నవిచలితచ్ఛాయలుఁ
గల బదరీతరులఁ జూచి కడు విస్మితులై."

అరణ్యపర్వశేషమ్మును పూరించిన ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి తిక్క-

నార్యుని తరువాతివాఁడు. ఈతఁడు నన్నయ తిక్కనల ననుసరించి రచనఁ గావించినాఁడు. ఈ కవివరేణ్యుని వర్ణనలు కొన్నియెడల నన్నయవర్ణనలం బోలియుండు. ఎఱ్ఱాప్రెగ్గడ శారదరాత్రులవర్ణనఁ గాంచుఁడు.

"స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోవ నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంస సారస మధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసర ముఖంబులు శారదవేళఁ జూడఁగన్"

అప్పుడు 'మదోత్కటద్విరదసంఘములు' దానాంభఃపటలమ్మునం బృథుపయోధారావళిందాల్చి గర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయోదానీకమ్ము శరచ్ఛయమ్మున నిగూఢాకారతన్ డిగ్గనాఁ' గా నొప్పారెనఁట. పెండియు నిర్మలకమలాకరమ్ములు 'విశదశారదాంబుద పరివేష్టనమునఁ బోలుచు గగనమ్ము ప్రతిబింబమో యనంగ వికచ కాశవనీపరివేష్టనమున' నతిశయిల్లెనఁట. ఇతని హరివంశమున మానవ మనస్తత్వమును ప్రకటించు ఘట్టములు రసవత్తరములగు ప్రకృతి వర్ణనముల కాకరములు.

ఇఁక తిక్కనార్యుని ప్రతిభ యనన్యసామాన్యము. ఈతనిరచనమ్ము నందు కవిత్వ గుణమ్ము లన్నియుం గలవు. ఈ మహాకవి కళాచతురత, మనోవృత్తి వివరణశక్తి, రసానుగుణ వర్ణనలు, సందర్భోచిత శైలి మున్నగునవి యనితరసాధ్యములు. ఈ కవితల్లజుఁడు ప్రపంచమందలి యేయితర సారస్వతమందలి యే యితర కవితోనైనం దులదూగఁగలఁడనుట నిస్సంశయము. అంతియగాక ప్రపంచ సారస్వతమందింత ప్రతిభాశాలి కలఁడా యనిపించును. సాంగోపాంగముగ వేదాధ్యయన మొనరించిన సోమయాజి. రాజనీతి నెఱిఁగి మనుమసిద్ధి రాజ్యచక్రమును నడిపించిన మంత్రిసత్తముఁడు. యుద్ధరహస్యములం దెలిసిన సేనానాయకుఁడు. రాజ్యము వైరులహస్తగత

మైనప్పుడు గణపతిదేవుని తన కవితాకన్యవదనమ్మున వశపరచుకొని రాజ్యమును తన రాజున కార్జించి యిచ్చిన నిక్కంపు నెచ్చెలి. స్వామిభక్తి పరాయణుఁడు. ఉభయభాషా ప్రవీణుఁడగు పండితుఁడు. నిరర్గళకవితాధారం బదునేను పర్వమ్ముల నేకథాటినాంధ్రీకరించినకవిసత్తముఁడు. శేముషీవిశేషమ్మద్వితీయము. తిక్కనదృష్టి యెప్పుడు కథాగమనవేగమ్మునందును. కావుననె యాతనివర్ణనలు కథాంశ సంబంధములు. చూడుఁడు.

"ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచునున్న నరసి
వేడినిట్టూరుపో యన వెడలెఁ గ్రొత్త
తావిమూతులు విచ్చు నెత్తమ్మివిరుల"

"తన మనమున పాండుతనయు
లని నేఁతకు వేడ్కఁజేయు టాత్మఁగని తమ
మ్మున వారు మెఱయరని వ
చ్చిన క్రియ శశి పూర్వశైల శిఖర మ్మెక్కెన్"

కథాంశ సంబంధములయ్యు నీ వర్ణనలు మిక్కిలి హృద్యములు. ఇంతమాత్రమున తిక్కనార్యుని వర్ణనలు కేవల కథాంశ సంబంధము లనుటకు వీలులేదు. ఔచితి ననుసరించిచేసిన రమ్యతరమ్ములగు ప్రకృతి వర్ణనలుకూడ పెక్కులుకలవు. ప్రభాతకాలమునందు నాకాశము—

"రాలియున్న పుష్పప్రకరము విదిర్చి
చెన్నుగా నున్న వేసిన సెజ్జ యనఁగ
వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద
భాతి చెలువొందెఁ జూడ నంబరతలంబు"

అనియు 'మృణాళకలశమ్ముల వలన బాలచంద్రశతాభిరామమ్ములగు శంభుజలమూర్తి విశేషమ్ములం బోని సరోవరమ్ములును,..........

రేపకడ వనలక్ష్మి పురశ్రీనలంకరించువడువున నెడపడక యెల్లెడల నిగురు విభాతకుసుమకదంబంబు పరిమళంబునైయున్నంత' అనియు వర్ణించియున్నాఁడు. సూర్యాస్తమయ వర్ణన తిక్కన.

"చుక్కలుతోడుతోడఁ దలసూపఁదొడంగె మనోభవుండు వి
ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె నేల కెం
పెక్కుచు వచ్చెఁ దీవియల యేడ్తెఱ సోయగమందె సందడుల్
దక్కెఁ బురమ్ము వీథుల మదమ్మెలసెన్ విటచిత్తవృత్తులన్"

అని చేసినాఁడు. చీకటిని సోమయాజి యెంతచక్కఁగా, సహజముగా వర్ణించినాఁడో చూడుఁడు.

"పెనుమిట్టిది పల్లమ్మిది
యనకుండఁగ నోలమ్ముం బయలు నొక్కటిగాఁ
గనువిచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్"

ఈ ప్రతిభాశాలిని ప్రశంసించుటకు పండితప్రకాండులే తమ యసమర్థతను వెల్లడించియుండ మాబోటి యాంధ్రవాఙ్మయ చరణ పరమాణువులా తత్కార్యమునకు సాహసించునది? నిజానికి పూర్వకవులలో భారత కవుల యందే నిక్కంపు కవిత నెలకొని యున్నది. కాని ప్రకృతి వర్ణనలోని భావదార్ఢ్యము, ఔన్నత్యము, రామణీయకమును గురించి చర్చించుచున్నప్పుడు నన్నెచోడ మహాకవియే యగ్రతాంబూలార్హుండని మాయభిప్రాయము. అతనికవితలో నలంకారసంపత్తి మెండు. సోదర ద్రావిడభాషా పద సమ్మేళన మిక్కవి కవితాప్రశస్తి కాటంకము. అయినను తాను చెప్పదాని నెదుటివాఁడు గ్రహించునటుల కవిత వ్రాయుటలో నితఁడు మిగుల ప్రౌఢ.

భారతకవులకును, కృష్ణదేవరాయలనాఁటి కవులకును మధ్యకాలమ్ము నందు ముఖ్యులు శ్రీనాథ పోతనలు. వీరు ప్రకృతివర్ణనయం దంతగా నాసక్తులయి యుండిన ట్లగుపడదు. శ్రీనాథకృత 'కాశీఖండ' గ్రంథ మందలి సూర్యోదయవర్ణన ప్రశంసనీయ మగు ప్రకృతి వర్ణన. ఆంధ్రవాఙ్మయమున పద్యరచనానైపుణ్యమున శ్రీనాథునింబోలు ఘనుఁడు లేఁడనుట నిక్కువము. సీసపద్య రచన మీ కవిసార్వభౌముని హస్తముల యందు సొంపులుదీరినది. గాంభీర్యగుణమున నీతఁడు మున్నెన్నఁదగిన వాఁడు. ఈతని కవనము బ్యాండు వాయిద్యముంబోలు. కాని పాండిత్య ప్రకర్షణమ్ములు నలంకార భూయిష్ఠమ్ములగు నీతని రచనల యం దంతగా మనోహరములగు ప్రకృతివర్ణనలు గోచరింపవు. శృంగార రసభరితమ్మును, అలంకారశోభితమ్మును, సంస్కృత సమాసాభిరామమ్మునై యలరారెడు నది యీతని కవిత్వము.

ఇఁక పోతనయన్ననో, 'బాలరసాలసాల నవపల్లవకోమల కావ్య కన్యకన్ కూళలకిచ్చి యప్పడుపుకూడు భుజింపక నిజదారసుతోదర పోషణార్థము హాలికుఁ డయి హరిభక్తియను మందారమకరంద మాధుర్య మునఁ దేలిన మధుపమ్ము.' తిక్కనార్యునివలెనీ భక్తాగ్రేసరుఁడు బుద్ధిపూర్వ కళాచతురుఁడు కాఁడు. కేవల మావేశభరితుఁడగు వ్యక్తి. భక్తిరసమును వర్ణించుపట్ల నీకవికుల తిలకుఁడు తనుఁ దానుమఱచి, పాఠకునిఁగూడ విస్మృతి సాగరమున నోలలాడించును. ఈతని కవిత్వముతో నుపమింపఁ దగిన దొక శ్రీకృష్ణుని మురళీగానమే. ఇమ్మహాకవి కేవలము రసలోలుఁడు. ఆవేశభరిత హృదయుఁడు. భక్తిని ప్రహ్లాదుని బోలువాఁడు. ఇమ్మహానుభావున కిష్ట మొక భక్తిరసము. కావున ప్రకృతి వర్ణనల కొఱకై మేలి కబ్బమున వెద కుట నిష్ప్రయోజనము.

శ్రీనాథ పోతనల యనంతరము మన యాంధ్ర వాఙ్మయమునకు శుభదినములు. కృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్యాధీశ్వరుఁడయి

తిమ్మరుసుంబోలు రాజనీతి విశారదు లొకయెడను, పెద్దనాది మహాకవి శిఖామణులు మఱొక్కయెడను, సామంత దండనాయకులు వేఱొక్కయెడనుండ మధ్య నవరత్న ఖచిత సింహాసనముపై రామకృష్ణుని పరిహాస వచనములకు మందహాస మొనరించుచుం గొలువుండిన దినములు. స్వయముగా కవియై యితరకవులను పోషించి యాంధ్ర సారస్వతమున కమూల్యోపకార మొనర్చినాఁడీ విద్యానగర సమ్రాట్టు. ఈ కాలమున నాంధ్ర కవితా పితామహుఁడు ప్రథమ ప్రబంధ రచన కుపక్రమించినాఁడు. ఈ పెద్దన పాండిత్య కవిత్వములు కృష్ణరాయని వంటి రసికుని జోహారు లందినవి. ప్రబంధరచనను పరిపూర్ణదశకు తెచ్చినవాఁ డీ కవి. ఈ కవి భావనాశక్తి మిక్కిలి ప్రశంసనీయము. వర్ణన లత్యంతస్వాభావికములు. కడుంగడు హృదయంగమములు. ప్రవరాఖ్యుఁ డా నిర్ణనారణ్యమున నొక్కదివ్యభవనమును చూచెనఁట. అద్దానిపరిసరప్రకృతి రామణీయకము నేత్రపర్వము. ఎట్టివానికేని యందు నివసింప నిచ్చగొలుపునది.

తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువ కేదారమ్ము తీరమ్మునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారమ్మునం దైందవ
గ్రావాకల్పిత కాయమాన జటిల ద్రాక్షాగుళుచ్ఛమ్ములన్
పూవుందీవల నొప్పు నొక్క భవనమ్మున్ గారుడోత్కీర్ణమున్

గంధర్వ గాన ఘూర్ణితమగు కోనయన్ననో యత్యంత మనోహరము. అద్దానిం బ్రశంసింప సాధ్యము కాదు. మన యల్లసానికవి సూర్యాస్తమయ మెంత స్వభావసిద్ధమో తిలకింపుఁడు.

శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షు లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృష్ణా వార్ధులింకెన్ జపా
శోణమ్మయ్యెఁ బతంగబింబము దిశాస్తోమమ్ము శోభాదరి
ద్రాణమ్మయ్యె సరోజషండములు నిద్రాణమ్ములయ్యెన్ గడున్.

  

ముక్కుతిమ్మన ముద్దుముద్దుగ వీణాకలకలముల కలకలనగు పలుకుల మెలపొలయ పారిజాతాపహరణము చేసినాఁడు. ఇతని గుంఫనము లతి సుకుమారములు, అత్యంత కోమలములు, ముద్దులమూటలు ఈ ముద్దుకవికి యుత్ప్రేక్షాలంకార మెక్కువ మక్కువ. ద్వితీయాశ్వాసమంతయు నించు మించుగ ప్రకృతి వర్ణనాభరితము. ఉత్ప్రేక్షాలంకార శోభితము. కాని యీ వర్ణనలు స్వాభావికములు కావు. కొన్ని భావనాతీతమ్ములు కూడ. ఇట్లయ్యు నొకటి రెండు స్వభావసిద్ధములగు ప్రకృతివర్ణన లిందు కలవు.

ఒక భృంగమ్ము పరాళిసీ మదనతంత్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవ మత్త నబ్జగృహసీమన్ బెట్టి తాఁబోయి సం
జకడన్ వచ్చి తదానమన్మకుళమౌ జాడన్ జనన్ రాక, యా
మికుఁడోనాఁ దిరిగెన్ గొలంకురమకున్ మేలెంత హీనమ్మొకో.

అనునది ప్రశంసనీయము. ఇఁక ధూర్జటి యన్ననో పోతనామాత్యుని వలె భక్తుఁడు. కాళహస్తీశ్వర మాహాత్మ్యము భక్తిరస భరితము. ఈ క్రింది యత్యద్భుతమ్మగు పద్యరత్న మీతని ప్రకృతి వర్ణనా సామర్థ్యమును ప్రకటించును.

ప్రాతఃకాల తుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వొసఁగు తద్బిందుచ్ఛటాజాత వి
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోద్దీర్ణ గేహమ్ములై
లూతాకల్పిత తంతుసద్మములు వొల్చుం జూడఁ జిత్రమ్ములై.

వీరిలో పింగళి సూరన యాంధ్ర కవితా పితామహునకు మనుమఁడఁట. ఈతనిసామర్థ్యము తాతగారికి దగ్గులునేర్పెడిదై యున్నయది. కల్పనా చాతుర్యమునందు, క్రొంగ్రొత్త త్రోవలు త్రొక్కినాఁడు. ఆంధ్రవాఙ్మయమున తిక్కన పోతనల యనంతరము నేఁటివఱకు నిక్కంపు వ్యక్తిత్వము కలవారు సూరన రామకృష్ణులు. ఇప్పుడు మనము చూడవలసినది యీ

సూరన ప్రకృతి వర్ణనము. ప్రభావతీ ప్రద్యుమ్నమందలి యీతని హంసలు మన కండ్లయెదుట ప్రత్యక్షమై యున్నట్లు గన్పట్టెడి.

ఇట్లు కన్పట్టుచు నేతెంచి హంసలు
వసుధ చేరువ నేటవాలుగాఁగ
నతినిశ్చల ప్రసారిత పతత్రమ్ములై
దిగుచుఁ గాముని ముందు దిక్కుఁ గొంత
సరి గడవగఁబాఱి మరలు బోరలు దెట్ట
గిల నొక్కకవ వంచి మలపు దిరిగి
యెఱుకలంతట రెండ నెఱయఁ జక్కఁగఁజూచి
యవనిఁ గాల్మోపి ఱెక్కార్చిముడిచి
మొగము లోకవింతయొయ్యారముగ మలంచి
యీకను విదిర్చికొనుచు నొక్కింతవఱకు
హైమ రేఖా విచిత్ర నిజాంగరుహ వి
నిర్మలతఁ జూడ్కులకు నింపునింపుచుండె.

ఇంక నాద్వారక యాకాశమునుండి చూచువారి కెట్లు విస్మయ సముద్రమున ముంచివేయుచున్నదో చూడుఁడు.

కలధౌత కేళీనగంబు కాఁబోలును
తనరుచున్నది శంభుతనువులీల
ఘనపుష్పచాంపేయ వనరాజి కాఁబోలు
వేలుచున్నది పులితోలు సిరుల
హరినీల సోపానసరణి కాఁబోలును
పగటుచున్నది నల్లపాఁపపేరు
పవడంపుటొల్లె సౌభాగ్యంబు కాఁబోలుఁ
జాటుచున్నది జటాజూటరుచిని

  

సరసీ కాంబోలుఁ గ్రాలెడి సురనదిగతి
నోడ కాంబోలుఁ బోలెడి నుడుపతి కళ
యనిమిషాధిప చూచితే యల్ల పసిఁడి
కోటనడిమి శృంగారంపు తోఁటలోన.

కథాకల్పనా చాతుర్యమున సూరన యగ్రేసరుఁడగుచో నవ్యవర్ణనా ఫక్కియందు రామకృష్ణుఁడు మున్నెన్నఁ దగినవాఁడు. ఏపనిఁజేసిన నీతని యందొక విధమగు నవ్యత, విలక్షణమగు వ్యక్తిత్వము చూపట్టును. ఈతని యీ క్రింది వర్ణన లపూర్వములు; మిక్కిలి హృదయంగమములు.

"మారుతాహతిరాలు నారికేళ ఫలాళి
నిడిసి జల్లించు పుండ్రేక్షురసము
చిలుకపోటులచేతఁ జిరిగిన సహకార
ఫలములఁ దొఱఁగెడి పచ్చితేనె
చిక్రోడదంష్ట్రిలు చెక్కుసుగంధిమ
నంటిపండ్లను గ్రాలునవ్యసుధయుఁ
బాకవేళారంభ పరిపాటిఁ దమయంతఁ
బగిలిన పనస తొంబండ్లచే స
మేతమై కాలువలుగట్టి యేకహేలఁ
బఱవ నందలి క్రియ్యాట పసిమితేటఁ
బండు నవ్వీట ముక్కారుఁబసిఁడిగారు
సరసధాన్యంపు మంచిరాజనపుఁజేల".

"మగువంపునలపుఁ బల్మఱుఁ గ్రోలికొల్లి క
న్మొల్పియూరక మేనుమఱచుఁ గొన్ని
యరవిచ్చు తెలిమొల్లవిరుల మూతులు సాచి
పొదిఁగూడి తెక్కలఁ బొదవుఁ గొన్ని

గురువింద పూఁదేనె పెరలకై తమలోనఁ
బొత్తువోవక సారెఁ బోరుఁగొన్ని
పక్వంబులగుదాఁకఁ బాటించి మల్లికా
కలికాని కాయంబుఁ గాంచుఁగొన్ని
భోగివశమైన గేదంగిపూవునకును
వగచు మఱికొన్ని బంధుజీవకలతాంత
గుచ్ఛములలోన నొక కొంత కొలువుసేయుఁ
దేటు లఖిల ర్తుమయవనీ వాటి గమిచి".

"గంధవిరహితమను బుద్ధిఁ గనక తేఁటి
మూతివిచ్చిన మోదుగుమొగ్గఁ దగిలి
సొరభాకాంక్షఁ జొచ్చిచెన్నారెఁ గీర
తుండవశమైన నేరెడుపండుఁబోలె".

సహజములగు నిట్టి వర్ణన లీతని కబ్బమున ననేకములు. స్థలాభావముచే నిట్టూర్పు విడుచుచుంటిమి. రామకృష్ణుని వర్ణనములు పూర్వాంధ్ర వాఙ్మయమున కననివి.

రామరాజభూషణాదుల గుఱించి ప్రసంగించుట యనవసరము. వారికి కావలసినది శ్లేష—చిత్రకవిత్వము మొదలగునవి. మనకు వలయునవి సహజములగు ప్రకృతివర్ణనలు. వీరియనంతరము వీరేశలింగ దీక్షితుని వఱకుం గల కవులలో యనుకరణము లెక్కడు. కథాకల్పనము శూన్యము. పాత్రపోషణ కానరాదు. శృంగారము. అదియును పచ్చిది. మఱొకరసము మృగ్యము. వీరిలో ప్రతిభాశాలి చేమకూర వేంకటకవి యొక్కఁడేయేమో!

ఇఁక మనదృష్టి వీరేశలింగమువంక మరల్తము. ఈ యుగమున కాది పురుషుఁడు. ఎంతప్రతిభాశాలియో కాని యాంధ్రవాఙ్మయమున నాతఁడు

త్రొక్కని త్రోవలేదు. ప్రబంధములు, అచ్చతెనుఁగు కబ్బములు, నిరోష్ఠ్య కావ్యములు, నవలలు, నాటకములు, శాస్త్రములు, భాషాంతరీకరణములు, ఉపన్యాసములు, వాఙ్మయ విమర్శనలు, మతవిమర్శనములు, చరిత్ర పరిశోధనలు (అక్కడక్కడ కొన్ని పొరపాటులు కలవు) మున్నగు వాని యన్నింటియందీతఁడు సిద్ధహస్తుఁడు. సంఘ సంస్కరణ పరాయణుఁడయి, పత్రికా సంపాదకుఁడయి, యుపాధ్యాయుఁడయి యిన్ని కార్యముల నెట్లు నిర్వహింపఁ గలిగెనని మే మద్భుతపడుచుందుము!

ఈ యుగమున వాఙ్మయము సర్వతోముఖాభివృద్ధి నందుచున్నది. కొందరు తప్ప యీ యుగమువా రాంగ్లవాఙ్మయ సంపర్కము కలవారు. Wordsworth, Shelley, Keats మున్నగు కవివర్యుల రచనములఁ జక్కగా పఠించినవా రగుటచే వారిపోకడ లాంధ్ర సారస్వతమునఁ గన్పట్టును. కాని కేవల మాంగ్లేయకవుల యనుకరణమే యాధునికాంధ్ర వాఙ్మయమని తలఁపరాదు. స్వతంత్రోజ్జ్వలభావ విలసనరమణీయములు నగు రచనములు గూడ యనేకములు. ఈ యాధునికులలో సుప్రసిద్ధ రచయితలు వేంకట పార్వతీశ్వరకవులు, రాయప్రోలు, అబ్బూరి, దేవులపల్లి, దువ్వూరి, బొడ్డు, విశ్వనాథ, తల్లావజ్ఝల, జి. జాషువ మున్నగువారు.

ఈ కవికుమారుల ప్రకృతి వర్ణనము లెంతటి స్వాభావికములో యెంతటి హృదయంగమములో చూడుఁడు. వేంకట పార్వతీశ్వర కవులు,

"జలతరంగముల నూయెలలూగినట్లుండి
తటిలేచి చలువల తఱుముచుండు
నరవిరి మొగ్గల నలరించునట్లుండి
యదనెంచి రజముల నపహరించు
లతకూన చెంత మెల్లన యున్నయట్లుండి
సమయమ్ముఁగని చుట్టు సడలఁజేయు

నసగొమ్మ నిట్టె యుంచినయట్టులే యుంచి
కొంటెమై వలపులఁ గొల్లవెట్టు
చలువతెక్కలకాఁ డురజంపుదొంగ
పైఁడిపచ్చిఁడు తావుల బంతికాఁడు"

అగు ప్రభాత వాత మాహ్లాదకరము. మఱియు—

"జలదమాలిక నింగిపై నలరుచుండ
మెఱుఁగుఁదీవెలు మిలమిల మెఱయుచుండ
పాటపాడఁగఁ జినుకులు పడుచునుండ
తరచుగాక తుషారమ్ము గురియుచుండ
ఱివ్వుఱివ్వున వలిగాలి ఱువ్వుచుండ
రేఁగి యొక్కొక్క జడిగొట్ట యాగుచుండ
కాఱుమబ్బుల చీఁకటి క్రమ్ముచుండ
నోఱపిడిఁగాంచి మేఘమ్ము లుఱుముచుండ
జోరుమని వానకాళుల జాఱుచుండ
స్వాంత మలరించు వర్షావసరముఁజూచి
మెడలుఱిక్కించి కూయు నెమళ్ళఁజూచి
మెలమి దివినాఁడు వానకోయిలలఁజూచి
తొరటవాయని శుకదంపతులను చూచి"

అను గీత మానందకరము. వీరి కవితయందు ప్రకృతి వర్ణనకు నిదర్శనములనేకములు. కవిభూషణుని నవ్యత, భావ వికాసము శ్లాఘాపాత్రము. ఈతని కావ్యమ్ము లన్నింట ప్రత్యేక వైలక్షణ్యము విస్పష్టము. ప్రకృతి సౌందర్య విలోకనమందు - తత్ప్రకటనమందు నీతఁడత్యంత నిపుణుఁడు. ఈతని కోయిల—

'పిలపిలయంచు మంచు గురి
పించెడి వేగున లేచి చిన్నిగం
టలు మెడలందు ఘల్లని స్ఫు
టమ్ముగ మ్రోయఁగ మేయు గొఱ్ఱెమం
దల సరిగాచు గొల్లని యు
దారపుటీలలలో ప్రతిధ్వనుల్
మొలవఁగఁజేసి మైమఱపు
ముంపులముంచెడు'

నది, మఱియు మేఘోదయమును

ఎండినబీళ్లయందు నుద
యించిన పచ్చిక కండ్లపండువై
యుండెను చూడియాలు తల
లూపెను క్రొత్తగవచ్చు నీటిచే
నిండె తటాక గర్భములు
నిష్కుటముల్ కడు శ్యామలమ్ములై
మెండుకొనెన్ వనిన్ మొగిలు
మేసెఁ బరిభ్రాతములందుఁ గొండలన్.

అని చక్కగా వర్ణించినాఁడు.

"దప్పిఁగొనిచేరిన మిళిందతనయతతికి
పూలపాలిచ్చి చీఁకట్లఁ బోవకుండ
కడుపులో దాచుకొనదె? శ్రీ, కమలదేవి
చేరఁదీసిన మమకార మేరికెఱుక?"

"ఎండలో మాడిపోవు లేఁయిగురు లరసి
యేడ్చునదుల పేరిమోదంత మెవఁడెఱుంగు?
నీటితరఁగల రేల్పవల్ నృత్యమాడు
చంద్రసూర్యులుకూడ నా జాడ కనరు"

"పూలబిడ్డల ప్రీతి నుయ్యాలలూపు
పవనుఁడెఱుఁగఁడు తొడిమలు వదలుననుచు
తలఁపులకు విరుద్ధములగు ఫలితములకు
బాధ్యులెవ్వరో పుణ్యపాపమ్ము లేవొ"

అను పద్యము లాంధ్ర వాఙ్మయమున యపురూపములు. వర్ణనలు సేయుటయందాతని నేర్పు గణనీయము.

"నిగనిగలెగయు కన్నెచిగుళ్ల గుంపుల
నీడలారెడు చిన్నినిమ్మచెట్లు
పురివిచ్చినట్లు నిమ్ములఁ గొమ్మపందిళ్లు
సాచుకుమారరసాలతరులు
చువ్వలల్లెదిగి చూచుక గుచ్ఛముల వ్రేలు
మొలకప్రాయపు బొలపోకచాళ్లు
కడలెల్ల వాసనల్ సుడిగొట్ట విదిలెడి
పూఁగొమ్మ లూఁగు పున్నాగమొక్క-
లందునందునఁ బెరిగి యా యందమైన
బ్రాహ్మణులయింటితోఁటకు వన్నెఁబెట్టు
వెదురులును గున్నగోరంటపొదలు బలసి
చోరనలవిగాని కంచెగాఁ బెరసియుండ."

  

"పచ్చగిలిన వసుంధరాభాగ్య సీమ
నెల్ల యెడలఁ గన్పించుగా నుల్లసిలుచు
పసుపుఁబూసిన ముత్తైదువల మొగాల
ననుకరించి గుమ్మడిపూవు లందమయ్యె".

అనునవి రసవత్తరములగు పద్యములు.

ఈ యాధునికులు పూలమొగ్గలఁ బెంచికొని వాని నెంతయో ప్రేమింతురు. స్నేహితులవలె భావింతురు. వానిని గుఱించి హృద్యములగు పద్యముల వ్రాయుదురు. ఇందుకు నిదర్శనము రామకృష్ణరాయని మందారశిశువు. వీరిలో నవీనుఁడు శ్రీ బాపిరాజుగారు. ఈతని పదముల పొందిక వానితీయందనము మెచ్చుకొనఁ దగినది. ఇతఁడును ప్రకృతివర్ణనాప్రియుఁడు. సూర్యభగవాను నుద్దేశించి—

"నిండిన తేనెతో వలపు నిండిన డెందముఁ గ్రాన్కవెట్టఁ గై
దండకు వేచియుండె మమతల్ చెమరించిన కావిమోవి మా
ర్తాండ మిటారి తమ్మి జవరా లదిగో సుకవీంద్ర రాణ్మణీ
మండలులైన యీ యళికుమారకు లింతకు విన్నవింపరే"

"పవడమ్ముల్ వెలివెట్టు మావిచిగురుం బజ్జీలు నోరూరగా
రవపుం గ్రొంజివి వీకఁ గోకిలపు పేరంటాండ్రు సాపాటుగా
నవలీలామయ పంచమశ్రుతుల సంధానించి నీకై సుధా
రవళిన్ మంగళ మాలపించిరి జగద్రక్షానురాగాకృతిన్"

"అరవిచ్చిన వెల్లలతాచయమ్ము
కోరి పాడిన వెల్ల శకుంతసమితి
ప్రకృతిమాత సహస్రకరమ్ము లెత్తి
స్వస్తినుడివెడి నవతరింపంగదోయి"

అనునవి సహజాపాత రమణీయోక్తులు.

"కలువపువ్వులకుఁ జక్కిలిగింత బొసఁగించి
కొసరి మాటకు నవ్వుకొనుచు మురిసి
వలగొన్న మబ్బుపిల్లలఁగూడి వేడుక
తోడ దాఁగురుమూతలాడి యలసి
తళుకుఁజుక్కల కన్నుగిలుపులఁ గడకంట
విడిసిన చిఱునవ్వు పొడల కదరి
పరువెత్తు మున్నీటితరఁగగుత్తాల స
వారీయొనర్చు బింబమున కుబ్బి

చలువవెన్నెల రేక పిసాళివలపు
నవ్వు కెరటాల తియ్యందనమ్ముతోడ
ఈ సమస్తజగమ్ము ముంచెత్తివిడిచి
చదలఁగొలువుండె మా మామ చందమామ"

అను చందమామను గురించిన పద్యము ప్రశంసా పాత్రము. రామిరెడ్డిగారి వనకుమారిలోని ప్రకృతి వర్ణన యీ క్రిందివిధము.

"కొండనెత్తమ్ములఁ గొరాడుమబ్బుల
గమన సౌందర్యమ్ముఁ గాంచికాంచి
మేఘోదయమ్మున మినమిన పురివిచ్చి
యాడునెమ్ములయొప్పు లరసియరసి
యమృత ధారలరీతి నచ్ఛమై ప్రవహించు
సెలయేళ్ళలోఁ గ్రీడ సలిపిసలిపి
ప్రకృతిమంజులమైన పక్షులగానమ్ము
తమిదీఱ వీనులఁ ద్రావిత్రావి

ఎండవేళల పూఁబొదరిండ్లదూటి
హరిణగర్భిణులకుఁ జివురాకులొసఁగి
ప్రసవమాలల ధరియించి ప్రతిదినమ్ము
గాననమ్ములరాణివై గ్రాలుచుండు."

తోరణాకారముగ వ్రాలిన వీరి పక్షుల వర్ణనమెంత స్వభావ రమ్యమో యోజింపుఁడు.

"చిలుకలదండు కేంకృతులు
సేయుచు మామిడియాకు తోరణ
మ్ములు చదలెల్లఁ గట్టినటు
మూఁగి చివుక్కున వ్రాలి దోరకం
కులు తమనోటఁ బెట్టుకొని
గూడులకుం గొనిపోవుచుండె సం
చలనము లేని నామనము
సందడినింబడి యుల్కిమేల్కనెన్."

ఒక కవివర్యుని మాపెంత ముచ్చటయో గనుఁగొనుఁడు.

చల్లఁగా మెల్లఁగా సాఁగు పిల్లగాలి
తరఁగలందు కలసిపోవు విరులవలపు
వోలె రజనిపడంతొక మేలిముసుఁగు
చాయలం దైక్యమై పోయె సాంధ్యరోచి."

కృ ష్ణ శా స్త్రి గా రి

"అలరుపడంతులెల్లరు హిమాంబువుల న్నవమల్లికాసఖీ
జలకము లార్చినారు వనజాత పరాగ మలందినారు మే
ల్జిలుగు హారంగు పొందళుకు చీరలుగట్టిరి పెండ్లికంచు కో
మల జలజాతపత్రముల మాటున నేఁటికి దాగినాఁడవో".

అను పద్యములోని కూరుపెంత కోమలమో భావమంత రమణీయము.

వి శ్వ నా థ స త్య నా రా య ణ గా రి

"కోనలన్నీ ముంచుకొని వచ్చు సెలయేటి
చాన కిన్నెరసాని జలజలా ప్రవహించు
నురుగులో పైకెగయు తరగలో క్రొంగ్రొత్త
తేనకాలువ లూరెనో
యమృతంపు
వానచినుకులు జాఱెనో -
తేనతరగలపిండులోన జలజల సాఁగు
చాన కిన్నెరసాని జాలైన మేలైన
వాకవో యందాల రాకవో బంగారు
జిలుగుగంటలు మ్రోగెనో
చిన్నారి బిగువునవ్వులు నాగెనో-"

అను వాగువర్ణన మిక్కిలి మధురము.

  

ఇఁక జాషువ కవివర్యుఁడు

'ఫిర్దౌసి' సర్వాంగపుష్టి మెఱయ

"ముదురు కోయిలకంఠమున నివాసము సేయు
కొసరింపుకూతల గుట్టుఁదెలిసి
ప్రతిపుష్పగంధ గర్భముఁ జీల్చికొనివచ్చు
పిల్లగాడ్పుల జన్మవృత్తమగసి
మేఘమ్ము తెఱచాటు మెఱపుబోగముసాని
మోసగింపుల యర్థమును గ్రహించి
శరధినాయకుని క్రొన్నరువు పిల్లలతీఱు
బడిలేని యాటల భావమెఱిఁగి
ముగ్ధమోహనసౌందర్య పూర్ణమైన
ప్రకృతిరమతోడ స్నేహభావమున మెలఁగి."

కబ్బము రచించెనని వ్రాసినాఁడు. ఈ సుకవివతంసునిపదము లతి లలితములు. సుకుమారములు. ఇక్కవి కవితాకన్య ముద్దరాలు. పాఠకుల చిత్తముల నాకర్షించుటయందు నూదంటురాయి. వేయిన్నూట పదారుల వియ్యమందినది. కమ్మందనమున కాటపట్టు. తిలకింపుఁడు మేఘుని వర్ణన మెంత మేలుతరముగా నున్నదో—

ఆకటందూలు సస్యశ్యామలక్షేత్ర
కన్యకడుపు చల్లగా భుజించె
బక్కచిక్కిన కొండవాగుం దటాకమ్ము
చిటుకలో నుప్పొంగి చియ్యబట్టె
ముమ్మాయముత్యమ్ము వోలె తామరమీఁద
వర్షబిందువు తాండవమ్ము సేసె

నడయాడురతనమ్ము వడువున నాడాడ
సారుదప్రిపురుగు ప్రత్యక్షమయ్యె
చెలఁగి చేయూఁత దానమ్ముఁ జేసిచేసి
కొఱతవడియున్న వాని కాపురముఁబోలి
యుబ్బుఁ జెడి తూలె నొకచిన్ని మబ్బుతునుక
యుత్తరమ్ముగ దిక్కుల క్రొత్తిగిల్లి.

ఇట్లీ కవి సత్తములు ప్రకృతి కాంతా నిరుపమాన సౌందర్యమును గాంచి ముగ్ధులై తదవలోకన జనితానంద పారవశ్యముచే దానిని వర్ణింతురు. కావున వారి వర్ణనలు సాంకేతికములు, పాండిత్య ప్రకర్షకమ్ములు నయి యుండవు. సౌందర్యానంద మనుభవించి వ్రాసినవి కావున స్వాభావికములై, సహజములై విలసిల్లుచుండు. ప్రకృతి కాంతాసౌందర్యముం గ్రోలియే వారు కవులగుచున్నారు. కావుననే యొకయాధుని కాంధ్రకవి కుమారుఁడు—

"గూడులకు వచ్చు పక్షులకూజితములు
సంజకెంజాయ గాఁడి చక్కఁదనము
విరుల వినవచ్చు కీటకావేశగీతి
కాపువానిని సైతము కవినొనర్చు."

అని సముచితముగా వ్రాసియిచ్చినాఁడు.

నెల్లుట్ల, రామకృష్ణకవి.
దేవులపల్లి రామానుజరావు (బి. ఎ.)

# ప్రే మ



ప్రేమ యనిర్వచనీయము, పవిత్రతమము. సకల కావ్యపదములం కన్న ప్రేమయే యధికము. ప్రపంచమందలి సమస్త కర్మములలోఁ బ్రథమ సూత్రము ప్రేమయే. కావుననే—

"మనసుచే వాక్కుచేత కర్మమ్ముచేత
కలుషితములు కాఁదగిన వీ వలపు లవని
తపసుచే తాల్మిచే ధ్యానధారచేత
లీనమై యైక్యమందఁజాలినది ప్రేమ."

అని పలికినాఁడొక యాధునిక కవికుమారుఁడు. ప్రేమ మహిమ వాచామగోచరము. రసికులకది కేవల మనుభవైక వేద్యము.

ప్రకృతియంతయును ప్రేమభరితము. అందుజరుగు ప్రతి కార్యమును ప్రేమకొఱకె. "చెట్టునకు మొగ్గదొడిగెడు చేష్ట" "కోరకమునకు వికసించు గుణము" "విరికి వలపుల వెదజల్లెడి విద్య" మున్నగునవి యన్నియు ప్రేమనిమిత్తము. వేయేల? ప్రేమశూన్యమగుసృష్టి దయామయుఁడగు పరమేశ్వర నిర్మితమనుట కల్ల.

ప్రేమయే దైవతము. కష్టసుఖములయందు మనుష్యున కానందముఁ జేకూర్చునది ప్రేమ యొక్కటియే. ప్రేమ ప్రాయముతో తగ్గునది కాదు. కలిమిలేములు దానిని మార్చలేవు. నిజానికి ప్రేమయందే, డెందము కందళించి రహించే నేకాకృతిఁ నిర్వృతిఁ జెందును. మానవ హృదయమున ప్రేమ యంకురించుట ప్రకృతి ధర్మము. అది యసహజమనుట యస్వాభావికము.

"శుక్తి ముత్యాలు పుట్టుట చోద్యమేని
పద్మమున తేనె యూరుట పాపమేని
మృదువులైన యస్మదుదారహృదయముల ప్రి
ణయరసోదయ మనుచితమైన నగును."

అని పలికినాఁ డొక విదగ్ధహృదయుఁడు.

నిక్కమగు ప్రేమ స్వార్థరహితము. ప్రతిఫలాపేక్ష లేశమైనఁ నం దుండదు. తుదకు ప్రేమింపఁబడిన వ్యక్తిచే నిరాకరింపఁబడినను ప్రేమించు వ్యక్తి హృదయమందు మాత్రి మది యెన్నటికి నదృశ్యము కాదు. నిండుచూలాలయి యున్న తన్ను మహోత్తాలాభీలకరాళకానన కిరాతవాత్రిత మధ్యమ్మునందు విడిచిపెట్టినను, జానకీదేవి శ్రీరాముని దివ్య మంగళవిగ్రిహము నాత్మీయ హృదయపీఠమునం దధిష్ఠింపఁజేసి యతని గుణములను ప్రేమసూత్రిమునఁ గుచ్చి పూజించినది. నిద్రావివశయై యుండ సగము వలువఁ జించుకొని తన్ను ఘోరారణ్యమధ్యమ్మునం దొంటిగా విడిచిపోయిన పతియెడ దమయంతికిం గల ప్రేమ కొంచె మేనియును తగ్గలేదు. ఇట్టి దృష్టాంతము లనేకములు.

ప్రేమోదయము మానవహృదయమ్ములందు మాత్రిమే కాదు. తది తర. పశుపక్షి మృగాదులయందుఁగూడ నిది విస్పష్టము. రాయంచజంటల రాగభరము, భృంగదంపతుల ప్రిణయము, హరిణీహరిణుల యనురాగము, యీ విషయమును స్థిరీకరించుచున్నవి.

వ్యక్తుల కన్యోన్య ప్రేమ కలుగుట పూర్వజన్మ సుకృతఫలము. అందును 'అస్ఖలిత ప్రిణయానురక్తి, చిరతపశ్శుద్ధిచేత నేకాని దొరకఁబోదు' అనినాఁడు కవిభూషణుఁడు, ఈయనరయే.

"పొరుపెఱుంగక యొక కంచమున భుజించి
మనసునాటిన మమతల ననఁగి పెనఁగి"

  

"కనులనొండొరులను జూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజనఁ గొనుటకన్న
కొసరి యేమోయి! యని పిలుచుకొనుటకన్న
చెలుల కిలమీఁద నేమి కావలయు సఖుఁడ!

అని వచించినాఁడు. మనుష్యుఁడు జన్మమధ్యమున నొక్క మారేని ప్రేమమాధుర్యము రుచి చూడనిచో నాతని జీవితము వ్యర్థము. ప్రేమ యననేమో తెలియక యుండుటకన్న ప్రేమించి విఫలమొందుట మిక్కిలి మేలు. ప్రేమశూన్యమగు హృదయ మొక హృదయముకాదు. అది కఠినశిల. ప్రేమ యహంభావముల నశింపఁజేయును. ముక్తిని కరతలామలక మొనరించును. దాననేకదా! బసవరాజు అప్పారావు—

"ప్రేమించు సుఖముకై, ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై ప్రేమింకవలెనురా
ఎద మెత్తనాటకై సొదగుందరా యంత
మదిఁగల యహమెల్ల వదలిపోవునురా"

అని చాటినాఁడు.

---

# పోతన పంగనామాల భరింపలేఁడా?



ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు, వాణీనికేతనము వారిచే ముద్రింపఁబడిన యాంధ్రభాగవతమునందలి ప్రథమ ద్వితీయస్కంధములు గల సంపుటమొందు, చిత్రకళాకోవిదులగు వర్మా బాబురావుగారిచేత తన మొగమున పోతరాజు విష్ణుభక్తునివలె నుండ వెలువడి దాసువిష్ణురావుగారి కన్నులఁబడినది. చూచినారు. ఒళ్లు గగుర్పొడిచినది. 'పోతన యూర్ధ్వ పుండ్రధారి కాఁడను నాయభిప్రాయమా; సరియగునది? లేక చిత్రకారుని చిత్రరూపమా?' అని విచారించుటయే గాక చరిత్రలను, భాగవతమును, యింక మఱి కొందఱికవుల గ్రంథములను కూడ బాగుగానే తిరుగ వేసినారఁట. అదొకకష్టముకూడ కాదు. తిరుగవేయుటలే కదా? సరి. ఎట్లయిననేమి? తమ యభిప్రాయమే స్థిరపడినది.

"భాగవతము ముఖ్యముగా విష్ణుకథలను - విష్ణులీలలను - వర్ణించి యుండుటంబట్టియు, భాగవతము కృష్ణునకు కృతియిచ్చుటంబట్టియు, షష్ఠ్యంతములు కృష్ణునిఁ గూర్చియే యుండుటంబట్టియు, (ఏమి? విష్ణురావుగారి కేగ్రంథమైనను కృతియొకనికి షష్ఠ్యంతము లొకనికిఁగూర్చియున్నట్లు కనుపడెడుకదా!) భాగవతరచనకు శ్రీరామచంద్రుఁడే తనకు కలలో కనిపించి పోతనను ప్రోత్సాహపఱచినట్లు వ్రాయుటంబట్టియు, (అబ్బా! ఈ 'పట్టియు' పదములు నా కాయాసముఁ గలిగించుచున్నవి.) భ్రమనంది చిత్రకారుఁడు పోతనను వైష్ణవమతజియ్యంగారివలె చిత్రించియుండవచ్చు" నని యూహించి, 'యిదియే యాతని రచనకాధారమైన యెడల నతఁడు (చిత్రకారుఁడు) నిరాధారుఁడైనట్లే' యని, 'యెందఱో శైవులు—తిర్యక్పుండ్రధారులు వైష్ణవకథారచనలఁ జేసినా'రని మచ్చునకు మొల్లను-కుమార ధూర్జటిని-కూచిమంచితిమ్మనను-శంకరాచార్యుల నుదహరించినారు.

రావుగారికీ నలువురు శైవమతావలంబకు లనుమాటయేతప్ప వారి వారి తత్త్వములుమాత్రము తెలియలేదు. మొల్ల యే కథఁగైకొనిన నాకు మోక్షము లభించునా యని విచారించినది. అందుల కొక్క దేవదేవుని చరితముతప్ప తక్కకథలయందే యొక్కటియును పుణ్యస్థితి వేదస్మృ యున్నట్లా మొల్లకు నమ్మకములేదు. అయిన 'గురుజంగమార్చనవినోద' యని యేల వ్రాసికొనిన దని ప్రశ్నింతురేమో! అందు తప్పులేదు: పూజింపవచ్చును. అంతటి మాహాత్మ్యము లేకున్నను శివుఁడు కేశవుని కళాంశజుఁడే కదా! అయినను మొల్లకు శ్రీహరియందున్న యనురాగము శివునియందు కానరాదు. ఈ యమ కిష్టదైవ మాతఁడే; చూడుఁడు. 'భుక్తికి ముక్తికి మూలమైన యా రాజును దైవమైన రఘురాము నుతించినఁ దప్పు గల్గునే?' అని ప్రశ్నించు భక్తమణికి, తిరుమణి శ్రీచూర్ణములు తప్పు లగునని విష్ణురావుగారు గాక మఱెవ్వరైన ననఁగలరా?

కుమార ధూర్జటికి కలలో శ్రీరాముఁడే తెంచి తన కొక కృతినిమ్మని ప్రోత్సాహపఱచిన వ్రాయు "కృష్ణరాయ విజయము"న రాముని కొంత కొండాడినను తుదకు 'కాశీపతిస్వామి ప్రోచునన్ను' అని తనయాత్మవిశ్వాసము నచ్చుగుద్దినాఁడు. ఇట్టివాఁడు పంగనామాల నెన్నఁడును ధరింపలేఁడు. అట్టి యుద్దేశ్యముతో నెట్టి చిత్రకారుఁడు నాతనిచెంతకు పోఁడు.

కూచిమంచి తిమ్మన శైవ సంప్రదాయములఁ గలవాఁడయి కొన్ని వైష్ణవకథలను వ్రాయుటయేగాక, యొకనాఁడు తన స్వప్నమునందు భావనారాయణస్వామి యరుదెంచి, 'శివునకు నాకును భేదము యవమాత్రము లేదు. నేనే యతఁడాతఁడనే నవిరళమతి నాకొక కృతిని' నిమ్మ యడుగ సర్పపురమాహాత్మ్య మొసంగినాఁడు. ఇతఁడు కేవల శైవుఁడేగాక, యద్వైతమతమవలంబించినట్లు తనకావ్యములుకూడ కొన్ని సాక్ష్యమివ్వఁగలవు. అయినను తిమ్మనకు పంగనామాలఁ బెట్టుటకు చిత్రకారుఁడు భయపడుచునే యున్నాఁడు. ఎందులకు? ఈయనశివునిఁ గీర్తించుచున్న సమయమ్మున వెన్ను

నంతటివాని మోమునుకూడ నంతగాఁబరికింపఁడు. చూడుఁడు. 'నీలాసుందరీ పరిణయము' నందుండి యొకటి రెం డుదాహరణములు. 'వేలుపు ఱేఁడునల్వ యును వెన్నుఁడు గొల్వఁగ మంచుగొండరాచూలినిఁ గూడి వేడుకలఁ జొక్కెడు లేనెలతాల్పుఁగొల్చెదన్' ఇచ్చటి 'వెన్నుఁడు' పదమునకు పోతన సహింపలేఁడు. కావలయునేని తక్కినవారల నొసంగును. 'ఏ వేల్పు గుడెతాల్పుతీవంచ మోముల తులఁవల బలుక్రొవ్వు తొలఁగమీటె' ఇందలి 'తులఁవల' పదము తిమ్మనకు శివుని వదలి చూచిన తక్కిన వేల్పులపయింగల యనాదరభావము సూచిత మగుచున్నది. పోతన గంటమున కిది యిష్టము కాదు. తిమ్మన కేశవునియం దంత భక్తిగలవాఁడే యగుచో నాతని గుఱించి వ్రాయు 'నీలాసుందరీ రుక్మిణీపరిణయమ్ము'ల యంకితమ్మున కెక్కడనో యున్న శివునకై వెదకుట లెన్నఁడేని సంభవించునా? అట్లు పెక్కుకృతుల సమర్పించి, యి ట్లింకను సంతృప్తిఁబడని తిమ్మనకు, నదే మతమునకు చెంది వ్రాసిన యాయొక రామాయణము నిందుమనమ్మున పెల్లుబ్బి నారాయణుని కర్పించు మొల్లకుం గల దూర మెన్ని యోజనములో దీన తెలియనగును కదా. ఇఁక తిమ్మన విషయమున చిత్రకారుఁడు భయపడఁడేల? కొలఁది తెలియఁ జెప్పుఁడు?

శంకరాచార్యుఁడు భజగోవింద శ్లోకములు – లక్ష్మీనఃసింహ జగన్నాథ స్తోత్రముల రచించెనని యాతనికిఁగూడ పంగనామాల నెక్కింప వచ్చునా? అను ప్రశ్న మపహాస్యాస్పదము. అతని కేనామమైన నొక్కటియే. కాని పంగనామాల భరింపలే ననుట కా మహానుభావుఁ డిప్పటి శంకరులలోనివాఁడు కాఁడు. అతఁడు కేశవాంశసంభూతుఁ డని రావుగా రిప్పటికైనఁ దెలిసికొందురు గాక! ఇఁక కథానాయకునిమాట.

పోతన తిర్యక్పుండ్రధారిగా నుండుట మన మెవ్వరమును చూడము. ఊర్ధ్వపుండ్రధారి కాఁ డనుట కాధారమును లేదు. వావిలికొలను సుబ్బారావుగారు (ఆంధ్రవాల్మీకి) కడప మండలమున పోతన విగ్రహ మెండు,

ఊర్ధ్వపుండ్రములు కలదానిఁగాఁ జూపింతురుగాక! కాని, యదివఱకే లోకము దాని నొక తంత్రముక్రింద పరిగణించినది. కావున నది నావాదమున కావంతయును పనిసేయదు. 'తనను లక్కమాంబ ధర్మగేహినిగాఁగ మనియె శైవశాస్త్ర మతము గనియె'నని కేసనను గుఱించి చెప్పెనేకాని పోతనయ్యయామతము నేను కంటినని యనఁడు. 'మానినులీడు కాదు...... ముద్దుసానికి సదా శివపాదయుగార్చనాను...... వాగ్భవానికి' అను వాక్యములఁ జూపించుచు మన (కాదు. 'నా' యనుఁడు) చిత్రకథకు ముఖ్య మని రావుగా రనుచున్నారు. ఇది తల్లినిగూర్చిన పద్యము. కాని, లక్కమాంబ కెవరును పంగనామాల నెక్కింపలేదు. మఱి దీని ప్రసక్తి యేమి?

ఈ యమ (లక్కమాంబ) 'తిప్పన, పోతన' యను నిర్వురఁ గొడుకులఁ బ్రసవించినది. అగ్రజాతుండగు తిప్పన 'ఈశ్వర సేవాకాముఁడని' 'సాధునయయుక్తుండ నయిన నేను శ్రీరాముని సన్నిధానమ్ముఁ గల్పించుకొనినాఁడ'నని పోతనయే తన వంశావతారమునఁ జెప్పుకొనుచున్నాఁడు.

'ఇది పరమేశ్వర కరుణాకలిత... కేసనమంత్రిపుత్ర' అను గద్యనుదహరించి, యీ పరమేశ్వరపదమున కర్థము నాదు పెద్దలు శివుఁ డనియే చెప్పినారు. మాటలను విరచి, ఈకలను పీకి విష్ణుపరమున చెప్పెదరేమో - 'వద్దు వ'ద్దనుచున్నారు. ఈ వాక్యములు భాగవతము తిరుగవేసినా మనుటకు సార్థకములు. మాటలను విరువపని లేదు. ఈకలను పీకనక్కఱలేదు. వామన చరిత్రమం దదితి కశ్యపునితో నారాయణు పరమేశ్వరు నేరీతిఁ దలంతునని యడుగుచున్నది. ఇక్కడి పరమేశ్వరుఁడు శివుఁ డనువారిని నారాయణ పదమున ముక్కుఁబట్టి పోతనయే 'హరి' 'హరి' యనిపించుచున్నాఁడు. విష్ణునకు ప్రత్యేకముగ పరమేశ్వరు నెక్కడ ప్రయోగింపలే దందురేని 'పయోభక్షణమ్మను వ్రతమ్మువలన నారాయణుండు తనకు ప్రత్యక్షమ్ముగాఁగ నా యదితి యాతనితో నాసుతులఁ గావు మనిన విని దరహసితవద్య

నుండై యాశ్రిత కామధేనువయిన యప్పరమేశ్వరుం డిట్లనియె' ననియు వామనుఁడు జన్మించుకాలమందు 'చతురాననుఁ డరుగుదెంచి యదితి గర్భపరిభ్రమ విభ్రముండగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతించె' నని యిట్లు పరమేశ్వరపదములఁ గేశవునకు పోతనభాగవతమునఁ గొన్ని వేలు ప్రయోగించినాఁడు. ఇతఁడొక్కఁడే కాదు. తనకలలో భావనారాయణస్వామి యరుదెంచి 'నా కొకకృతి నిమ్మని యప్పరమేశ్వరుండంత ర్హితుండైన'యని సర్పపురమాహాత్మ్యమందు కూచిమంచి తిమ్మన వ్రాసినట్లు చూడవచ్చును. భారతమ్మునం దర్జునుండు శ్రీకృష్ణుని విశ్వరూపదివ్యతేజమ్మును చూచి 'నాకుం జెప్పవే! యెవ్వరో యని శంకించెద నిన్ను' ననవుడు నప్పరమేశ్వరుం డేను లోక క్షయకర్తయగు కాలుండ ననిన 'నీతొంటి సౌమ్యాకారమ్ము గైకొను' మనుడు, దయార్ద్రచిత్తుఁడగు నప్పరమేశ్వరుఁ డక్కిరీటి కిట్లను నని కవిబ్రహ్మకూడ పరమేశ్వరశబ్దములు హరికి కొల్లలుగ ప్రయోగించినాఁడు. ఇంక నిట్టితర కవు లనేకు లనేకస్థలముల విష్ణునకు పరమేశ్వర పదముల నుపయోగించినారు. ఈప్రసంగ మనవసరమేయని తెలిసియు మచ్చున కిట్లు చూపింపవలసివచ్చినది. మన్నింపుఁడు. పోతన శివునకు సర్వేశ్వరుఁ డని కేశవునకు విశ్వేశుఁ డనినాఁడు. చూడుఁడు. శివునిచే మఱల ననుగ్రహింపఁబడిన దక్షుఁడు 'సర్వేశ్వరుండగు హరునకిట్లనియె'ననియు,'విశ్వాత్ముఁడు. విశ్వేశుఁడు,విశ్వమయుఁ,డఖిలనేత విష్ణుఁ'డని విరించి నారదునకుఁ జెప్పుచున్నాఁడు. ఇక గద్యయందలి పరమేశ్వరపదము పోతన శివునికే చెప్పినాఁడనుటకు నిదర్శనమేమి ? నిష్కారణముగా పెద్దలను రచ్చ కీడ్చుట రావుగారిది గాక చిత్రకారుని దేమి సాహసము?

తదనంతరంబు భాగవత రచనాకారణము:—'మదీయ పూర్వజన్మ సహస్రసంచిత గంగకుం జని, క్రుంకులిడి వెడలి మహనీయమంజుల పులినతలమ్మున మహేశ్వర ధ్యానమ్ము సేయుచు' నను వాక్యములఁ జూడుమనుచున్నారు. అయిన పోతరాజును చంద్రగ్రహణముకొరకు కాశీ గంగాస్నాన

మున కేఁగినవానిఁగా నిరూపించుచో మహేశ్వరపదమునకు చిత్రకారుఁడు శివునిఁగా నంగీకరించుటయం దిసుమంతయు సందేహింపఁ డనుటయే దీనికి ప్రత్యుత్తరము. ఏమి? రావుగా రుదహరించిన మాటలు పోతనవి కావా? అని ప్రశ్నింతురేమో?-అతనివే. పోతనవియే, అందనృతము లేదు. అయిన చిత్రకారుఁడేల యేకీభవింపఁడు? తోడ్తో పోతన 'మరల కొన్ని దినమ్ములకు నేకశిలానగరమ్మునకుం జనుదెంచి' అనుచున్నాఁడు. అపుడు ప్రయాణసౌకర్యములు లేవు. బమ్మెరనుంచి కాశికి కొలతవేసిచూచిన, పోతన, మఱలివచ్చుటకు కొన్ని మాసము లగునేకాని, కొన్ని దినము లనుట పొసంగదనియేనా? కాదు. అట్లని శ్రీశేషాద్రిరమణకవులు చెప్పుదురేమో! కాని చిత్రకారుఁడు వెట్టివాఁడు కాఁడు. కొన్ని మాసములకు కొన్ని దినము లని చెప్పుట కలదని యతఁడెఱుంగునఁట. అయినను పోతన 'మహేశు' పదముఁ జెప్పి, యెక్కడ శివుని ధ్యానించు నొక పద్యమేని వ్రాయలేదఁట. అది కారణమ్మున నాతఁడు కాశీ గంగానదికి పోలేదఁట. గంగకు పోవుట నిజమేనఁట. గంగ పదము పోతనకాలమందుఁ గూడ గోదావరికిఁ బర్యాయముగ నున్నదఁట. మఱి నోరెత్తెద రేని—

ఆ॥ 'ఆమహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్ము
యోగిముఖ్యు బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మమయిన వానిఁ బరుని నతీంద్రియు
నీశు దూరు సూక్ష్ము నే భజింతు."

నని మహేశ పదమున, మకరిచేఁ బట్టుబడినకరి నోట పోతనవరదుని భజింపఁజేయుచున్నాఁడట. ఇఁక మహేశపదము శివునిదేయని యెట్లు వాదింతురో - రావుగారికి దారియేదో - ఆపోతన వంశజుఁడ వగు నీవే నామాలుగా వారిని ప్రశ్నింపు మనిచిత్రకారుఁడు నన్ను చూచుచున్నాఁడు. దీనికేమి జవాబని నేనడుగుచున్నాను, చెప్పరేమి?

'ఇతఁడు (పోతన) పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర' అను గద్యము వ్రాసియునికి చూడ నితఁడు శివభక్తుఁడనియుం దెలియుచున్నది. అని ,1935' వ సంవత్సరమునందు, ఎ-కణ్ణక్ సెట్టి కంపెనీవారిచేఁ బ్రకటిత మయిన భాగవతమునందలి యుపోద్ఘాతమందు శ్రీ నాగపూడి కుప్పస్వామయ్యగారు కూడ వ్రాసినారు. ఆయిన నిప్పట్టున నేను పరమేశ్వర పదమును హరిగా నిరూపింపను. వీరు విష్ణురావుగారి త్రోవఁ ద్రొక్కలేదు. అంతే కాదు.,మహేశ్వర పదమున కర్థము హరిగాఁ జెప్పినారు. చూడుఁడు -'ఒక సోమోపరాగ పుణ్యకాలమ్మున గంగానదికింజని క్రుంకులిడి, మ్రాఁగన్ను వెట్టి హరిచరణమ్ముల ధ్యానించుచున్న యెడ' అనియు, నితనికింగల హరిభక్తియంతయు నచ్చుపడ శ్రీవిష్ణుదేవుని లీలామాహాత్మ్యమ్ములు పరిపరివిధములఁ దన యావచ్ఛక్తిని వినియోగించి మనోహరలీలల వర్ణించి యున్నవాఁడు.......సప్తమస్కంధమునఁ బ్రహ్లాదచరిత్ర ప్రస్తావనమున హరిభక్తి వర్ణింపఁబడియున్న రీతి యంతయు నవాఙ్మానస గోచరము. అది చదువఁ జదువమనమ్ము భగవంతుని పాదారవిందయుగళమ్మున లయించుటయ గాక పోతనామాత్యుని వర్ణనాచాతుర్యమ్మును నీశ్వర (విష్ణు) భక్తియు నింత యొప్పునే యని డెందమున నిబ్బరంపుటబ్బురమ్మును గదిరెడి...శ్రీరామ దేవునికి పరమభక్తుండు కావున రామాయణము నే తెనిఁగింపఁ దనకుఁ గోరిక యగ్గలమ్మనియు నైనను దద్గ్రంథ మంతకుఁ బూర్వమే భాస్కరాదులచేఁ దెనిఁగింపఁబడి యుండుటచే దానినే మగుడఁ దారచియించుట చర్విత చర్వణమ్మనియుఁ బదిరెను. భాస్కరుఁడు లేదా రామాయణమ్మును బండ్ల కెక్కింపనా? యనియుఁ జెప్పి పోతన విషాదపడి యది మానుకొని భాగవతము దెనిఁగింపఁ బూనుకొనెననియుఁ బెద్దలు వ్యవహరింతురు......

"ఇతని యెడం జూపట్టు హరిభక్తి యగ్గలము" అని పోతనను హరిభక్తియం దనన్యసామాన్యునిఁగా నొప్పికొనినారు. (అనఁగా పంగనామాలు పోతన భరించుననియే.) ఇట్టితఱి పోతన శివభక్తుఁడు కాఁడని చిత్రికారుఁ

డెప్పుడును వాదింపఁడు. హరిప్రాపుగల మానిసి త్రిపుండ్రముల ధరింపవల దనియజ్ఞులుఁగాక, ప్రాజ్ఞులు ప్రాణము పోయినను వచింప సాహసింతురా? రావుగారికి పాఠముఁజెప్పఁ బూనిగాక యీ వ్రాతకు నాకేమిపని? హరుఁడు హరికాఁడా? హరి హరుఁడుకాఁడా?

ముందట పోతనవంశీయుల పేర్ల నుదహరించుచు నివియన్నియు శైవమతావలంబకులే ధరించున వనుచున్నారు. నిజమే. కాని నేనుమాత్రము కేసన, కేశవ, లక్కమ, లక్ష్మి, మాచమ, మహాలక్ష్మి శబ్దముల తద్భవము లను పొంతకుపోను. నా హృదయము వారలు శివమతస్థులు కారని వాదించుట కాదు, చిత్రకారుఁడు వారలకు పంగనామాల నెక్కింపలేదు. పోతనకుఁగాక అతఁడు, నేను శైవశాస్త్రమతము గంటిననలేదు. వైష్ణవమతమును ద్వేషింతునని చెప్పలేదు. చూడుఁడు. రామకృష్ణుల క్రీడాభివర్ణనమున 'తనువున నంటిన ధరణీపరాగమ్ము పూసిన నెటిభూతిపూత గాఁగ, ఫాల భాగమ్ముపయిఁ బరగు కావిరిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగ...'

'హారవల్లు లురగహారవల్లులు గాఁగ
బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివునిపగిదినొప్పె శివునకుఁ దనకును
వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు'

అనుచున్న పోతనకు త్రిపుండ్ర, ఊర్ధ్వపుండ్రము లెట్లు భేదము లగునో దురూహ్యము కాదా?

అటు మీఁదట నన్నిగుణములు (అబద్ధములు కూడ గుణములే) కలిగినవారలయందిర్వురు ముఖ్యులని పోతనయు వారి సంతతివారును పరమ శైవులని స్పష్టమగుచున్నదను రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారియు 'పోతనమతము శైవ' మను శ్రీగురిజాడ శ్రీరామమూర్తి గారి యభిప్రాయముల నుదహరించినారు. సంతోషము. కాని, యట్లేయన్ని

యెడల కందుకూరివారి యభిప్రాయములను వేదవాక్యములుగా విశ్వసించి బల్లగుద్దుట రావుగారికి మొదటికే మోసము వాటిల్లును. ఏమన శ్రీ పంతుల వారు కవుల చరిత్రముల వ్రాయఁ బూనుట కుక్కతోఁకఁబట్టుకొని గోదావరి నీదుటవంటిదే యని వెస్లియన్ హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులగు శ్రీ పెదగాడ గంగయ్యగారు తమ కవుల సంగ్రహ చరిత్రము - రెండవ భాగము నందు వ్రాయుచున్నారు. ఒకవీరేకాదు. శ్రీ చెళ్లపిళ్ల కవి పంచాననుఁడు కుమార ధూర్జటినిగూర్చి ప్రసంగించుచు 'పంతులవారి వ్రాతఁబట్టిణిమేని........యది సర్వవిధముల నపహాస్యాస్పద మగునని వేఱుగ చెప్పనక్కరలే' దనుచున్నాఁడు. ఇట్లనే యింక ననేకులు పోతనకును నెల్లుట్లవారి కేమి సంబంధము లేదను శ్రీ పంతులవారి వ్రాతను నేను కూడ నవల తన్నివేయుచున్నాను. ఏమి లాభము? తెలియని విషయమ్ములఁ దెలియన ట్లుండక పెద్దమనిషినగు నా చెప్పుచున్న ప్రతి మాటకును లోకము తప్పక తలయూచు ననుకొని శ్రీ చౌదరి గారు జి. జాషువకవినిఁ గూర్చి వైచు వెట్టి ప్రశ్నములెల్ల నిజమైనవిగా నన్ను పాలంభించుచు గృహలక్ష్మి పత్రికవలె నా మాట కడ్డులేదనుకొనుట పంతులుగారిది భ్రాంతియగుఁగాక! లోక మెప్పుడును గ్రుడ్డిదికాదు. నెల్లుట్లవా రంద టిపుడు వైష్ణవులుగ నున్న నేమి? మొదట శైవమతావలంబకులగు లింగధారులే. ఈ విషయము నిదివఱకే మాకు పూజనీయులగు స్వర్గీయ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు శ్రీ పంతులవారి వ్రాతను ఖండించినారుకూడ. ఇప్పటికిని పోతనమతము శైవ మను శ్రీ రామమూర్తి గారినే తప్ప, పోతనకు 'పరమ' శబ్దముఁ దగిలించు పంతుల వారిని నే నొప్పుకొనను. ఇంతట మిన్నకుండక వారితరపున నెవరైననుసరే నాపై దండెత్తివత్తురేని, ఒక 'పరమ' కాదు. పోతన శైవమతస్థునకు జన్మించెనేకాని యా మత మాతఁడెన్నఁడు నవలంబింపలేదని వాదించి మఱి మెప్పింతును. ఖబర్దార్!

గురిజాడవారి యభిప్రాయమును చిత్రకారుఁడు కొట్టివేయుట లేదు. పోతనమతము శైవమనిన యా శ్రీరామమూర్తి గారిచేతనే యాతఁడు పంగనామాల ధరింపలేఁడని, యట్లు సేసిన చిత్రకారునిది తప్పేయని ఏది? చేయెత్తింపుఁడు, చూతము. ఏమి ఫాయిదా! ఇందలియేయొక్క యుదాహరణమును నిర్భీతిగ నిలఁబడి పోతనపంగనామాల భరింపలేఁడని వాప్రివ్వబలము కలిగినది కాదు-లేదు.

అయిన పోతనమతము వైష్ణవమేనా? అట్లని యెట్లు సెప్పవలసు పడును? పోతన 'శంభుపదాబ్జ పూజారతుండు' అని కూచిమంచి. అయిన నేమి? తనకు తానయి పోతన నాయన్న శివుని సేవించువాఁడు - నేను శ్రీరామునిభక్తుఁడనని చెప్పుకొనుచున్నప్పుడిఁక కూచి మాటను పాటించున దెవఁడు? అని వాణీనికేతనము వారు పట్టుబట్టి కూర్చుండియు నాబలవంతము మీఁద తుదకట్లో కూచిమంచి నొప్పుకొని తోడ్తో పోతనను హరికీర్తికి విముఖుఁడు కావలయుననుచున్నారు. అతఁడేమో నేను కాననుచున్నాఁడు. దీని కెవరేమి సేయుదురు? చూడుఁడు.

'చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని...
కలుగనేటికి తల్లుల కడుపుచేటు?'

అనికంఠమెత్తుచున్నవాఁడు పంగనామాల నేలభరింపఁడు? లేఁడను వారి కాధార మేమున్నది? దాన పోతనకు వచ్చెడి పాపమేమి?

మీఁదుమిక్కిలి 'చేతులారంగ శివుని పూజింపఁడేని' యనిన పోతనయే, దక్షయజ్ఞ కథయందు శివునిఁగూర్చి - 'అనయమ్ము లుప్తక్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాదలేనివాఁడు-మత్తప్రచారుఁడున్మత్తప్రియుఁడ'ని పెండియు, వసుధనెవ్వారు ధూర్జటివ్రతులువారు వారికనుకూలురగుదురెవ్వారు వారునట్టి సచ్ఛాస్త్ర పరిపంథులైనవారలవనిఁ బాషండు

లయ్యెద'రని యా వేళమున తన వంశమునుకూడ మఱచిపోయి గంటమును నడిపించినాఁడు. దీనికి చిత్రకారుఁడు సంతోషించుటలేదు. శివదూషణము కేశవునిదేల కాదనివిచారపడుచున్నాఁడు. స్థూలముగ గాక సూక్ష్మదృష్టినరయు వారికిది దూషణము కాదుకూడ. ఇట్లని పోతనయే చెప్పినాఁడు, తిలకింపుఁడు. 'ఇట్లు దక్షుండుపల్కినవాక్యములు వినిందితమ్ములగుం గాని యాథార్థ్యమ్మున భగవంతుఁడగు రుద్రునియందు ననిందితమ్ములై స్తుతిరూపమ్మున నొప్పె!' కాని వీరభద్రవిజయ మెంతవఱకుపోతనదిగా వాదింతురో యంత దాఁకనిది దూషణముగానే పరిగణింపఁబడును. ఏమన 'భాగవత ప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షకృద్యాగ కథావిధానత ననల్పవచస్కుఁడ నైతితన్నిమిత్తాగమవక్త్రదోషపరిహారతకై యజనైక శైవశాస్త్రాగమ వీరభద్ర విజయమ్ము రచించెద వేడ్కతోడుతన్' అని వీరభద్రవిజయము పోతన వ్రాసినట్టు గన్పించుచున్నది. కావుననే యది దూషణముగా లెక్కింపని శ్రీరామమూర్తిగారు వీరభద్రవిజయము పోతనది కాదని యంత పెద్దగా విమర్శించుట. కాని విష్ణురావుగారు వీరభద్రవిజయము పోతన వ్రాసినట్లుగానే విశ్వసించినారుకదా! ఇఁక నది దూషణము కాదని యెట్లు చెప్పుదురు? వేరేల? పోతన పంగనామాల భరింపలేనివాఁడేయేని యీతీరు భాగవతము వ్రాయుటకుఁగూడ భరింపఁడు. మాటికి కాదు — కాదు. ముమ్మాటికి చెప్పుదును. శైవులు కేశవుని కథలను వ్రాసినారు. లేదని యెవ్వరుననరు. భాగవతము కేవల మొక దేవదేవునే గాక శివునిఁగూడ కీర్తించుచునే యున్నది. అందలి భేదమే యీ పంగనామాలకుంగల కారణము. కాని రావుగారి పిచ్చియూహ కాదు. తెలియునా?

చూడుఁడు చిత్రకారుఁ డీసమస్యకెన్నఁడును తీసిపోఁడు. "దేవమానవులలో ముక్కంటి సేవించువారు బహువస్తుసంపదల సౌఖ్యానందులై యుండ మునివర్యులు రమామనోవిభుని శశ్వద్భక్తి సేవించుచుంగడు పేదలౌట కేమి కారణమ్మని పరీక్షిత్తు శుకయోగీంద్రునడుగుటయు నావుడు

కాలకంధరుండు వినుత గుణత్రియాన్వితుండు కాన రాగాదియుక్తమై రాజిల్లు సంపద లాతనిఁగొలుచువార లందుచుందురు. అచ్యుతుననంతు గుణాతీతుఁ బురుషోత్తము నాదిపురుషు (ఔరా! ఏమి యీ యభిమానము!) నర్థిభజియించువారు రాగాదిరహితులగుచు దీపింతు రెంతయు'నని పరిక్షిత్తునకుఁ జెప్పినాఁడు. ఈ వాక్యములను పోతన కలమే వ్రాయు నేని యిఁక వేఱె చెప్పవలయునేమి? ఎన్ని విధమ్ముల గమనించినను పోతన శివునిమించి కేశవునియందే తన చిత్తము నూల్కొల్పి యుండువాఁడని భాగవతము నేకదృష్టితో - కాదు కన్నులు మూసికొని చదివిన వారికిఁ గూడ సువిదితము. ఇట్టిప్రాణము లున్న యుదాహరణముల నింక నెన్నియో చూపెదను. కాని వ్యాసమున కంత ముండదు.' లక్ష తిమ్మన్నలు కోటి ధూర్జటి కవులు పోతన పంగనామాల భరింపలేఁడని చెప్పలేరు. ఇఁక విష్ణురావు గారి మాట యేమి? పోతరాజు నిజముగ పంగనామాల భరింపలేకున్న చిత్రికారునితో విష్ణురావుగారి కన్నులఁబడిన యా రెండు స్కంధము లప్పుడే భగ్గునమండి భస్మమైపోవేల ? అంతటి వేదాంత రహస్యవేత్త ,నదైవం కేశవాత్పరమ్' అని తెలియలేదనునది వెఱ్ఱిమొగాలు-పప్పురామయ్య లను మాట. చిత్రికారునిపయింగల తమ కోపము దీర్చుకొనుట కజ్ఞానులై పోతనను పంగనామాల భరింపలేనివానిఁగాఁ జేయు కుతర్కము భాగవతాపచారమగుఁగాక! వాణీనికేతనమువారిదేమి? ఏయాధారమును లేక పోతనపుండ్రము విచారింప దొరఁకొనుట ఓనమాలఁ జదువుకొని భాగవతమున కర్థముఁజెప్పెడి సాహసము రావుగారిదగుఁగాక! చిత్రకారుని దేమి? అట్టి వ్యాసములను ప్రకటించుట తత్పత్రికాసంపాదకులు తమ యవివేకములు వెలిబుచ్చికొనుట లగుఁగాక! మ కేమి?

# అముద్రిత గ్రంథములు



౧

స్వప్నకథ; ఔచిత్య విచార-
పరామర్శ.
(గృహలక్ష్మి కోసము)

౨

శృంగార, శాకుంతలము'
(దృశ్య కావ్యము)

౩

'హరిమాయ'
(దృశ్య కావ్యము)

౪

సారస్వతారామము
(విమర్శలు)

